

స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత స్త్రీలకు విద్యావిజ్ఞానాలు సర్వతోముఖంగా విస్తరిస్తున్నవి. ఈ చిత్రంలో న్యూఢిల్లీ లేడీ ఇర్విన్ కళాశాల విద్యార్థినులు ఇత్తడికి మెరుగుపెట్టడం, కొయ్యవస్తువులతో గృహాలంకరణలాంటి పనులను నేర్చుకొంటున్నారు.



సమాజవికాస కార్యక్రమాలలో గ్రామములందు పాతబావులను మరమ్మతు చేసికోవడం, క్రొత్తవాటిని త్రవ్వుకోవడం శ్రమదానంద్వారా మహిళలకు పరిపాటి అయింది.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నము! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య


★

# ఏకైక మహిళా ప్రధాని

## శ్రీమతి సిరిమావో బండారనాయకే



శ్రీ లంకలో ఎన్నికల ఫలితాలు ఫ్రీడంపార్టీకి అజేయమైన బలం సమకూర్చినవి. ఈపార్టీ నాయకురాలు శ్రీమతి సిరిమావో బండారనాయకే సింహళమునకు ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేయడంతో ఆ దేశానికి నూతనాధ్యాయమే కాక ప్రపంచమొత్తంమీద ఏకైక మహిళాప్రధాని కావడం ప్రతి యొక్క స్త్రీకి గర్వ కారణం.

ఈ నాటి కల్లోలితప్రపంచాన్ని ఆపదలనుండి, కష్టాలనుండి రక్షించగలది మహిళానాయకత్వమేనేమోనని యనుకునే విజ్ఞులు లేకపోలేదు. పురుషులలో యీ నాడు అలవడియున్న అవాంఛనీయమైన గుణాలు అనేకం స్త్రీలలోలేవు. సున్నిత

హృదయం, యుక్తాయుక్త పరిజ్ఞానము, సానుభూతి, శాంతి సౌభాగ్యాల పట్ల ఆసక్తి చిత్తశుద్ధి స్త్రీలలో మెరుగైన స్థాయిలోనున్నవని చెప్పవచ్చును. అవే ప్రపంచ ఉద్ధరణకు, మానవశ్రేయస్సుకు అత్యవసరాలు. వీనినే శ్రీమతి సిరిమావో నాయకత్వము శ్రీలంకకు సమకూర్చనున్నవని ఆశిద్దాం !

శ్రీమతి సిరిమావో పూర్వము సింహళమునకు ప్రధానిగానుండి హత్యగావించబడిన శ్రీ బండారనాయకే భార్య. ఆమెకు తనదేశంపట్ల, ప్రజల శాంతి సౌభాగ్యముల పట్లగల ఆసక్తి ఆమె భర్త దేశభక్తికి సరిసమానమైనవి. శ్రీ బండారనాయకే గాంధీజీ సిద్ధాంతముల ననుసరించిన జాతీయవాది. నిష్కల్మషమైన హృదయంతో జాతీయ, అంతర్జాతీయ విధానములను రూపొందించుటలో మన దేశాన్ని అనుసరించిన వాడు. శ్రీలంక, మనదేశాలు ఉభయుల సమస్యలు న్యాయంగా, ధర్మంగా పరిష్కారానికి, ప్రపంచశాంతి సౌభాగ్యాలకు సంబంధించిన విధానాలను రూపొందించడానికి భగవంతుడు శ్రీమతి సిరిమావో బండారనాయకే నాయకత్వానికి తోడ్పడుగాక! ఆమె నాయకత్వము ఆదర్శప్రాయమగుగాక!

శ్రీమతి సిరిమావోను హృదయపూర్వకముగా నభినందిస్తున్నాము.

# గృహనిర్వహణశాస్త్రం



సాంఘిక శాస్త్రం, సమాజవికాసం స్త్రీలకు ఎంత అవసరమో గృహనిర్వహణ శాస్త్రం సయితము అంత ప్రాముఖ్యమైనదని చెప్పాలి. వైద్య, ఆరోగ్యరంగాలలో స్త్రీలకృషి ఎంత అమూల్యమైనదో సంఘానికి ఆయువు పట్టయిన కుటుంబశ్రేయస్సుకు గృహవిజ్ఞాన శాస్త్రం అంత అత్యవసరమయినది. ఈ గృహవిజ్ఞాన శాస్త్రం గతంలో బాలికలకు తల్లులే నేర్పుతుండేవారు. కాని యీ నాడు ఉన్నత విద్యనభ్యసించడానికి ఉపక్రమించిన బాలికలకు గృహవిజ్ఞానశాస్త్ర శిక్షణపొందడానికి అవకాశాలు బహు పరిమితమయిపోయాయి. దానిపట్ల నిర్లక్ష్యము, చులకన సయితము బాగాప్రబలింది. ఆడపిల్లలు తాము విద్యావంతులమనే ధీమాతో విద్యావిజ్ఞానములు అంతగాలేని తల్లి మాటను పెడచెవినపెట్టి అనాదినుండియుంటూయున్న కుటుంబసౌభాగ్యానికి ప్రమాద పరిస్థితులను సృష్టించుచుండుట సయితము మనకండ్ల ఎదుట ప్రత్యక్షమగుచున్నది. ఈ పరిస్థితులలో తల్లి నిస్సహాయస్థితి అవాంఛనీయముగనున్నది.

ఈ పరిస్థితులలో విద్యాధికులైన స్త్రీలకు సుచి, శుభ్రమైన, రుచికరమైన ఆహారమును సేకరించుకోడానికి, తయారుచేసికోడానికి తెలియకపోయినచో కుటుంబముల లోని ఆరోగ్య, ఆర్థికస్థితిగతులు ఎలాగ తారుమారుకాగలవో యూహించతగినవి.

ఇక ఇల్లువాకిలి కళకాంతులతో శుభ్రముగానుంచుకొనుటకుగాని, పిల్లలను క్రమపద్ధతులలో, ఆరోగ్యవంతంగా పెంచుటకుగాని, బంధుమిత్రులను, అతిథి అభ్యాగతులను ఆదరించుటకు గాని తమకు తెలియక గృహవిజ్ఞానానికి సంబంధించిన ప్రతియొక్కపనికి పరిచారకులపై నాధారపడవలసి వచ్చినచో ఆర్థికదుస్థితి విషమంగా పరిణమించడమే కాక గృహంలో సుఖసౌభాగ్యములు, పరస్పర సన్నిహిత సద్భావప్రేమానురాగాలు క్షీణదశకురాగలవు. ఆర్థికవసతులున్న కుటుంబంలో విద్యాధికులైన స్త్రీలు గృహనిర్వహణమును పరిచారకబృందంతో నడుపుకోవచ్చునుకాని స్వయంగా గృహవిజ్ఞానముకలిగి ఆసక్తితో గృహమును దిద్దుకొనుటవల్ల అమరే సుఖంగానీ, సత్ఫలితాలు కాని ఏనాటికి అమరవు. కాబట్టి యీ నాడు గృహనిర్వహణశాస్త్రం పట్ల ఆసక్తి స్త్రీలకు కలిగించాల్సిన బాధ్యత విద్యావిధానముపకున్నది. కళాశాలలలో గృహనిర్వహణ శాస్త్రబోధన శుష్కదండుగ అనేదానికంటె ఆశాస్త్రాన్ని ఆకర్షణీయంగా, వాస్తవిక పరిజ్ఞానానికి అనుగుణంగా రూపొందించి బోధించడంమంచిది. తల్లులు బోధించవలసినదని విద్యావిధానంలో మినహాయిస్తే ఆగృహనిర్వహణ శాస్త్రమునకు బాలికలు మరింతదూరమై ముందుముందు అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడగలవు. ఈ నాడు పాకశాస్త్రబోధన రుచికరమైన, సేవించుటకనువైన వంటకాల తయారీని ప్రోత్సహించుటలేదంటే ఆశాస్త్రాన్ని సిద్ధాంతరీత్యానే కాకుండా అది వాస్తవిక పరిజ్ఞానసమ్మతమైన ఆచరణయుక్తమైన శిక్షణకులోబడక పోవడమే కారణమని చెప్పాలి. శిక్షణా నిర్వహణలో సిద్ధాంత పరిజ్ఞానమే కాక అనుభవ, ప్రజ్ఞా విశేషాలుకూడ సమానపాత్రవహిస్తే కాలేజీలలో బాలికలకు గృహనిర్వణశాస్త్రం ఉపయుక్తంగా నేర్పి శిక్షణనియవచ్చును.

సంఘంలో మెరుగైన జీవితాన్ని ప్రోత్సహించే సేవా త్యాగాలు, చిత్తశుద్ధి, పరస్పరసానుభూతి సద్భావ సహాయ సహకారాలను సాంఘిక శాస్త్రం బాలికలకు జాతీయశ్రేయస్సు దృష్ట్యా గరపకలిగితే దానిననుసరించి సమాజవికాసం - విద్యావిజ్ఞానరంగాలలోను, ఆర్థిక, పారిశ్రామిక, ఆరోగ్య, వైద్యరంగాలలోను అభివృద్ధి అభ్యుదయాలు శరవేగంగా సమకూరగలవు.

ముఖ్యంగా స్త్రీల విద్యా విధానం జాతీయ విశిష్టత కనుగుణ్యమైన కుటుంబ జీవితాన్ని ప్రోత్సహించేదిగానుండాలనీ ప్రతి యొక్కరు గుర్తించి ముందుకునడుపాలి !



# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



శ్రీ గోపాలకృష్ణ మీనన్, మద్రాసు రాష్ట్రమున యొక గొప్ప ఉద్యోగిగ నుండెను. ఉద్యోగము విరమించుకొనుటకు రెండు సంవత్సరముల పూర్వము, బెంగుళూరు నగరమునకు వెలుపల నొక చిన్న స్థలమును చౌకధరకు తీసుకొనెను. ఉద్యోగము ముగిసిన వెనుక, అచ్చట నివసించుటకై ఒక భవనమును నిర్మించ నెంచి, ప్లాను తయారు చేసెను. ఒక కూటము, రెండు గదులు, వసారా, వాటికితోడు ఇతర అవసర సౌకర్యముల నియమించి, యొక కంట్రాక్టరునకు పని ఒప్పజెప్పెను. భవనము "ఆనందవిలాసము" తయారు చేయబడెను.

శ్రీ మీనన్ కొంతకాలమునకెల్ల బెంగుళూరు చేరెను. ఆనందవిలాసము వాకిలి సమీపించెను. అతని ఏడుగురు బిడ్డలు, ఎనిమిది మంది పౌత్రులు, ఇద్దరు బావమరదులు, మేనల్లుడు, అతనికి ముందు చేర భవనమునెల్ల ఆక్రమించిరి. వారివారి సామగ్రి చక్క బెట్టుకొనిరి. అతని భార్య వారిలో సందు కల్పించుకొని కూర్చునగలిగెను. పాపము! శ్రీ మీనన్, పడికట్లపై చతికిలబడెను. కోపము, ఆవేశము, ఆయాసము, చెమట కారుచున్నది. కంట్రాక్టరు పూర్తి మోసము చేసెకదా! తాను కూర్చునుటకు చోటు లేకపోయెను కదా! అని కొరత బడుచుండెను.

కంట్రాక్టరు కనబడుటతోడనే, అతనిపై ఎగిరిపడెను. కొరత బడుచుండు మాజీ వుద్యోగి యొక్క ఆవేశపు ప్రగల్భములెల్ల ముగిసెను. కంట్రాక్టరు నెమ్మదిగ, "అయ్యా! మీ ప్లాను ప్రకారము కట్టడము నిర్మించినాను. దానికి ఖర్చు పుచ్చుకొంటిని. కంట్రాక్టరుకు, యజమానికి నుండగల మర్యాదయందు లోటులేక కార్యము ముగిసినది. అందు ఎట్టి లోపములు లేవు. ఇరువురి సంబంధము తీరినది. అయిన, మీరు గొప్ప కుటుంబీకులు. మీ కష్టములు గమనించగలిగితిని. నా సానుభూతి తెలుపుకొనుచున్నాను" అని సెలవు పుచ్చుకొనెను.

అదేవిధముగ, తెలిసిచేసిన, తెలియకజేసిన, విమర్శించిచేసిన, విమర్శించకజేసిన కార్యములన్నియు, మన భవిష్యత్సంపదకు ప్లానులుగ ఏర్పడుచున్నవి. మనము సమర్పించిన ప్లానుల ప్రకారము, కంట్రాక్టరువలె, ప్రభువు, మన జీవిత ఆవరణముల నిర్ణయించుచున్నాడు. శ్రీ మీనన్‌వలె, మనము సమర్పించిన ప్లానులు మనకు అనుకూలముగ లేకున్నచో, మన తప్పిదమని యెంచవలెను. ఇతరుల నిందించలేము. దాని పరిహారార్థము, మన తప్పిదములను సవరించుకొని, ప్రపంచ వ్యవహారమున, ఇకముందు, చక్కని అనుభవములను పొందులాగున, ధర్మ వ్యవహారములు, ధర్మ జీవితముల కలవడవలెను.

శ్రీ మీనన్ తన ఆనందవిలాసమున, శోకవిలాపముల పొందుచుండక, నూతనముగ కొన్నిగదుల నిర్మింపజేసెను. సుఖపడుచుండెను. అదేవిధముగ, మనముకూడ, చేసిన తప్పిదముల కనుగుణముగ బద్ధులైయున్నను, ఈ యజ్ఞశాల భవనమున కూర్చుండియే, మన జీవితమనబడు భవనమునకు నూతన గదులనగల ఉన్నత జీవితాశయములను, దినచర్య వికాసమువలన, పొందుటకు స్వతంత్రులమైయున్నాము.

దృశ్యమగు బహురూప ప్రపంచము లయము పొందునపుడు, వాసనల రాశి మాత్రము మిగిలియుండును. ఈ వాసనలు వృద్ధిపొంది, వ్యక్తమగునపుడు, మరల ప్రపంచసృష్టి కలుగుచున్నది.

సంస్కారములేని సామాన్యమానవుడు సృష్టి సిద్ధాంతమును తెలుసుకొనుట అసాధ్యము. బ్రహ్మాండమున కలుగుచుండు వ్యవహారములు మానవుని బుద్ధికి గోచరములు కావు. పదార్థ విజ్ఞానశాస్త్రమున గల ఐన్‌స్టీన్ మహాశయుని, సాపేక్షిక సిద్ధాంతము (Theory of Relativity) కూడ సామాన్య మానవుడు గ్రహించలేడు. అయినను, ఈ సిద్ధాంతముల విచారించుము, బ్రహ్మాండమున విహరించుట మాని,

వ్యక్తిగతముగ, మనయందు జీవిత విధానమున, వెదకినచో, సులభముగ బోధపడగలవు.

మాండూక్యకారికయందు, ఇట్లు వివరింపబడు చున్నది. స్థూలదేహముతో తాదాత్మ్యముపొంది, జాగ్రదావస్థ ననుభవించు నా యందలి జీవకళ, విశ్వు డనబడును. సూక్ష్మశరీరముతో తాదాత్మ్యముపొంది స్వప్నావస్థల ననుభవించునపుడా జీవకళను తైజసు డనబడును. కారణ శరీరాభిమానముతో సుషుప్తావస్థ ననుభవించు నాయందలి జీవకళను ప్రాజ్ఞుడన బడును. ఈ కారణ శరీరమనగా, సుషుప్తియందు మనసునందుగల పూర్వ వాసనలన్నియు అణగియుండు సంపుటము. సుషుప్తియందు, మనస్థూల, సూక్ష్మ శరీరములు లయించుచున్నవి. అనగా నిద్రయందు, మన శరీరములు, అవి వ్యవహరించు ప్రపంచములు, అన్నియు ప్రళయము పొందుచున్నవి.

ఒక సాధువు, ఒక ధూర్తుడు ఇరువురు ఒక ధర్మశాల పంచన రాత్రియందు నిద్రించుచున్నారు. అపుడు సాధువుయొక్క ధర్మచింతనా ప్రపంచము, ధూర్తుని దుష్టవ్యవహార ప్రపంచము, వారివారియందు లయము పొందుచున్నవి. ఆ సమయమున సాధువు నందు ధర్మచింతనలు ప్రకాశించవు. ధూర్తునియందు దుష్టవ్యవహారములు బయల్పడవు. ఆ ధర్మచింతనలు, దుష్టభావములు వారియందు అవ్యక్తమగుచున్నవి. వారిరువురు మేల్కొనిన వెనుక, వారివారి వాసనలు బయల్పడును. సాధువు భగవన్నామ సంకీర్తనలు చేయును. ధూర్తుడు దుష్టకార్యముల కవకాశము వెదకుచుండును.

ఇట్లు సుషుప్తావస్థయందు, వ్యష్టి అహంకారము కారణ శరీరమునందు అణగియుండుటను బ్రహ్మాండ ప్రళయమనవచ్చును. అప్పుడు ప్రపంచమనునది లేదు. వ్యష్టియందువలెనే, సమష్టియందు కూడ, అవ్యక్తము ప్రళయమునందు అణగియుండును. అంతియకాని, నాశమనునది లేదు. సుషుప్తి ముగిసి, జాగ్రత్తునకు మేల్కొనగా, ధూర్తుడు దుష్టచేష్టలను వదలడు. సాధువు పరమార్థమును వదలడు. ఇట్లు సమిష్టి వాసనలు, సృష్టి పొందగల ప్రపంచమునందలి రీతి, నియమములను నిర్దేశించుచున్నవి. అణగియుండు వాసనలు వృద్ధిపొంది, పక్వము పొందుటతో, ఉబికి ఉద్రేకము పొందును. అణగియుండజాలవు. కనుక అవి క్రొత్త ప్రపంచముగ వ్యక్తమగుచున్నవి.

నెలలు నిండినవెనుక, శిశువు గర్భమున అణగి యుండజాలడు. తన అభివృద్ధికి తగునట్లు, తల్లి గర్భమునుండి వెలువడి, భూపతనము పొందును. అదేవిధముగ, వాసనలు, పక్వము పొందుటచే, ప్రశాంతముగ సుషుప్తియందు అణగియుండజాలక, వ్యవహార ప్రపంచమునకు దొర్లుకొనిపోవును. దీనికి తగు ఉదాహరణమును తెలుపుటచే విశదము కాగలదు. ఉదయము నాలుగు గంటలకు నీవు రైలుకు వెళ్లవలసియున్నది. సామాన్యముగ ఆనాడు నీకు సుఖనిద్ర యుండదు. సమయమునకు సరిగ, పడక నుండి లేచెదవు. పరుండునపుడు, మనసుకొక తీవ్ర సంకల్పమును కల్పించియున్నావు. అట్టి సంకల్పము వలన కలిగిన కంపములు దాగియుండి, నాలుగు గంటలకు సరిగ పక్వమగుచున్నవి. స్వాభావికముగ ఇతరుల సాహాయ మపేక్షించకయే, ఆ సూక్ష్మవాసనలు నాలుగు గంటలకు మునుపే ఉద్రేకముతో తల చూపును. అందువలన సకాలమున నీవు మేల్కొను చున్నావు.

ఇట్టి భావమును మనసునందుంచుకొని, గురువు తెలుపు వాక్యములను గమనించినచో, అవి విశద మగుచున్నవి. పరబ్రహ్మము, సమష్టి వాసనలతో తాదాత్మ్యముపొంది, వాటిద్వారా వ్యక్తమగుటకు, "నేను ప్రపంచమును సృష్టించెదను" అని సంకల్పించెను. మనము ప్రతియొక్కరు నిద్ర యను ప్రళయము నుండి ప్రతిదినము మేల్కొనునపుడు, ఇట్టి వ్యవహారము చేయుచున్నాము. మేల్కొనిన వెనుక, మన మనోవాసనల రీతిగ, మన వ్యవహారములకు ప్రత్యేక ప్రపంచ ఆవరణము కోరుచున్నాము.

ఒక న్యాయవాది, ఒక భీమా ఏజంటు, ఒక వైద్యుడు, ఒక ధనికుడు, ఒక రాజ్యాంగమంత్రి, ఒక గుమాస్తా, ఒక పురోహితుడు, ఒక మోసగాడు, అందరు వారివారి నిద్రనుండి మేల్కొనగా, వారి తొలి కోరికలు ఒకరికొకరికి వ్యత్యాసములు కలిగి యుండును. న్యాయవాది అనేక కక్షిదారులను కోరును. భీమా ఏజంటుకు భాగ్యవంతులపై మనసు వెళ్లి తన వ్యాపారము వృద్ధిపరచుకొన నెంచును. పురోహితుడు తన లాభమునకై అనేక భక్తుల కోరును. మోసగాడు జ్ఞానమునకన్న అధిక ధనము గలవారిపై దృష్టియుంచును.

వీరి యందరిలోను, ప్రతియొక్కరియందు, వారి కోరికలు, వారి పూర్వ వాసనల కనుగుణముగ నున్నవి. అదేవిధముగ, సమష్టి వాసనల సమూహము, ప్రళయమునందు అణగి, పక్వము పొందుటవలన, ఆ

వాసనలు పూర్తిగా వ్యవహరింపగల ప్రపంచమును నిర్బంధముగ సృష్టి పొందుటకు కారణమగుచున్నవి. అందువలన, సృష్టియనగ, వాసనల అభివ్యక్తము లేక వ్యాపకము అని తెలియవలెను.

ఈ విషయములెల్ల, వేదకాలమున శిష్యులకు పరిచయమై యుండెను. అథవా ఉపనిషన్మంత్రముల తెలుపుటకు పూర్వము ఈ విషయములగూర్చి, గురువు విస్తారముగ ప్రసంగించియుండును. ఇందు కనబరచిన భావములెల్ల, "అతడు ప్రపంచములను సృష్టించెదనని సంకల్పించెను" అను వాక్యమున ఇమిడియున్నవి.

శ్రు|| స ఇమాంల్లోకా నసృజత. అమ్భో మరీచీ ర్మర మాపో౽ దో౽ మ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠా న్తరిక్షం మరీచయః పృథివీ మరో యా అధస్తా త్తా ఆపః|| (౨)

[అమ్భస్, మరీచీ, మరం, ఆపః - ఈ లోకముల నతడు సృష్టించెను. దూరమున యుండునది - అంభస్ నక్షత్రమండలము (ఆకాశము)నకు పైన యున్నది. దానికి నక్షత్ర మండలము (ఆకాశము) ఆధారము. వాయుమండలమే మరీచీ. భూమియే మర. అందుకు క్రింది భాగమున నుండునది ఆపః (నీరు).]

పరబ్రహ్మము - శుద్ధుడగు ఎఱుక - సమష్టి వాసనలద్వార వ్యవహరించును. అందువలన వ్యష్టి కూడ అతడే యగుచున్నాడు. అతనికి వ్యష్టియందు కోరికలు, ఊహలు, భావములు కలుగుచున్నవి. సమష్టివాసన సమూహములెల్ల, పరిపూర్ణముగ, తేజోవంతముగ ప్రకాశింపగల ఆవరణములగు ప్రపంచమును అతడు సృష్టించెను. మొదట లోకముల సృష్టించెదనని కోరెను. తదనుసారము ఈ లోకములను సృష్టించెను - అని ఋషి తెలుపుచున్నాడు.

వ్యక్తిగతముగ, మన ప్రతియొక్కరి నిత్యజీవితమున ఇట్టి వ్యవహారములు జరుగుచున్నవి. ఒక గదియందు ఒక వైద్యుడు, ఒక న్యాయవాది నిద్రించుచున్నారు. మరుసటి ఉదయము ఇద్దరు మేల్కొనిరి. వైద్యుడు - అనగా, ఆ శరీరమును ప్రకాశింపజేయు జీవ చైతన్యము - తన వాసనల కనుగుణముగ, ప్రత్యేక ఆవరణముల కోరును. ఇండ్లయందు చూడవలసిన రోగులు, తనవద్దకు రాగల రోగులు, చేయవలసిన శస్త్రచికిత్సలు, మందులు ప్రయోగములు, ఔషధ నిర్ణయములు వీటిని ఆలోచించును. న్యాయవాది నిద్దుర లేసగనే, అతని జీవచైతన్యము అతని వాసనల కనుగుణముగ వ్యవహరించును. న్యాయస్థలములు, బందిఖానాలు, కక్షిదారులు, గుమాస్తాలు, ఇతర న్యాయవాదులు, పిరియాదులు, నిబంధనలు, ధర్మసూత్రములు వీటిని న్యాయవాది ఆలోచించును. ఇరువురు సంపాదించు ద్రవ్యమున వ్యత్యాసములు లేవు. కాని, ఆ వైద్యుని ప్రపంచము, న్యాయవాది ప్రపంచము ప్రత్యక్ష భిన్నములుగ నున్నవి. ఇరువురు తమ వాసనల పూర్తి జేసుకొనుట కనుకూలమగు ప్రపంచములను కోరుచున్నారు. పిమ్మట తాము సృష్టించగలిగిన ప్రపంచములను ఫలవంతమగునట్లు వ్యవహరించుచున్నారు.

అదేవిధముగ పరబ్రహ్మము, సమష్టి వాసనలచే నియమింపడి లేక నిబద్ధుడయి లేక తాదాత్మ్యము పొంది, తదనుగుణ ప్రపంచములను సృష్టించ సంకల్పించుచున్నాడు. అతడు సంకల్పము చేయుటతో కార్యము పూర్తియగుట కూడ అగుచున్నది. కనుక "అతడు ఈ ప్రపంచములను సృష్టించెను" అని తెలుపబడుచున్నది.

"అతడు ఈ ప్రపంచములను (బహువచనము) సృష్టించియుండినచో" అవి ఎక్కడున్నవి? మాకు కనబడునది, మనము నివసించు ఈ భూగోళమొక్కటియే కనబడుచున్నది. ఋషి వాక్యములవలన మన కిట్టి సందేహము కలుగును. శిష్యులుకూడ ఇట్టి సంశయము కలిగియుండిరని ఋషి గుర్తెరిగి, సమాధానముగ, శ్రుతివాక్యముల వినిపించుచున్నాడు. పరబ్రహ్మము నాలుగు విధములగు ప్రపంచములను సృష్టించెను. అవి యన్నియు కలసి, అన్ని విధ వాసనలకు అనుగుణ వ్యవహార ఆవరణములుగ నున్నవి. వాసనాశ్రయము పొందుటకవి యోగ్యముగ నున్నవని గురువు తెలుపుచున్నాడు.

సంస్కృత భాషయందు లోకమను పదమును ఆంగ్లమున అనువదించునపుడు ప్రపంచమనబడును. ప్రపంచమనుట అనుచితమేగాక, భావము లోపించి భ్రమ కలిగించుచున్నది. లోకమనగా, అనుభవించగల క్షేత్రమని సంస్కృత భాషయందు తప్పక అర్థము కలదు. ఆత్మ సంపర్క బలమువలన, శేషించియుండు వాసనలు, తేజోవంతమై, వ్యవహరించుటకు, నాలుగు వేరువేరు క్షేత్రములు సృష్టింపబడినవి. అవి అమ్భస్, మరీచీ, మరం, ఆపః - అని ఉపనిషత్తు తెలుపుచున్నది.

(సశేషము)

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౪౬

కవచమును గల్గి, చేఁబట్టి కత్తి, చాప
బాణముల, లక్ష్మణుని గూడి - ప్రమదమలర
నాకుఁగని పింపుమయ్య శ్రీ నాథ! రామ;
చిద్విలాస! శుభాకార! శ్రీనివాస!

౪౭

సుగ్రీవ మిత్రుండ! సుజనానురక్తుండ!
పరమ పవిత్రుండ! బాంధవుండ!
సీతాకళత్రుండ! శ్రీరామ చంద్రుండ!
నవహేమ సూత్రుండ! నటనచతుర!
కారుణ్య పాత్రుండ! కమనీయగాత్రుండ!
శతపత్ర నేత్రుండ! సజ్జనుండ!
మహనీయ విభవుండ! మహితగుణోపేత!
దేవతావంద్యుండ! దివ్యమూర్తి!
సాధుసంరక్షకా! శిరసానమామి!
మాని జనవిధేయా! శిరసానమామి!
సత్యపరిపాలకా! శిరసానమామి!
సౌమ్యగుణచరితా! శిరసానమామి!

౪౮

శ్రీ రాఘవా! హరీ! శ్రీనాథ! సాకేత
పురనాథ! శ్రీమనోహర! ముకుంద!
రావణసంహార! రాఘవేశ్వర! రామ
చంద్రా! స్ఫురద్రూప! సార్వభౌమ!
వాసుదేవా! పరాత్పర! శ్రీనివాసా! ము
కుంద! దామోదరా! కువలయేశ!
గోవింద! శ్రీకృష్ణ! గోవర్ధనోద్ధార!
దాశరథీ! పవిత్రాత్మ! వరద!
రామ! శ్రీరామ! సీతాపతీ! మహేశ!
పాపసంహార! పతితపావన; మురారి!
యంచు నాజిహ్వసతతంబు మించుప్రేమ
నిన్ను భజియించుగాత! సంపన్న చరిత!

౪౯

జయము! జానకీ వల్లభా! జయము!
జయము!
జయము! భవవంద్య! నీరజ చరణ
యుగళ!
జయము! జలజాసనసుపుత్ర! జయము!
జయము!
జయము! రారాజ! కృపవార్ధి! జయము!
రామ!

౫౦

రామ! నీ పాదభక్తి నిరంతరంబు
నాకు దయసేయుమయ్య! శ్రీనాథ! భక్తి
యే కదా! ముక్తి మార్గంబు శ్రీకరముగ
భక్తిఁ జేకూర్పుమా! పరాత్పర! ముకుంద!

(సశేషము)

---

"సుధాకర్! చివరకు మా నాన్నగారితో మన వివాహమును గురించి అడిగావుగదా! ఆయన ఏమన్నాడో ఉన్నదున్నట్లుగా చెప్పు" అన్నది ఆతురతతో ఒకయువతి ప్రియునితో

"ఏమని చెప్పమంటావు! మారు మాట్లాడకుండా పైనబడి ముఖం మొత్తి పంపించాడు" అన్నాడు యువకుడు.

'సిసి'

# భ్రాతృప్రేమ

శ్రీ ఇవాన్ వజోవ్



హిస్సారియాలో అందరికీ వాడిని తెలుసు. కోట దక్షిణపు ద్వారాలవద్ద (యీ ద్వారాలకు "ఒంటెలని" పేరు) వాడు యాత్రికులను కలుసుకునేవాడు. వాడు వారికి శుభాభినందనలతో హుషారుగా సంతోషంగా స్వాగతమిచ్చేవాడు. వారిని సంతోష పెట్టడమెలాగో వాడికి తెలుసును. కాబట్టి వారికి పాన్లెఫెర్టిగ్‌ను గూర్చి బాగా తెలుసు. వారికి వాడంటే చాల యిష్టంకూడాను—వాడికి వుదారంగా డబ్బులిచ్చేవారు.

పాన్లెఫెర్టిగ్ పద్దెనిమిది యిరవై ఏళ్ల కుర్రవాడు. చింకిబట్టలతో దీనంగా కనిపించేవాడు. కొంత బలహీనత, కొంత ఉద్వేగం, దయాహృదయుడుగా అనూయకుడిలా అగుపించేవాడు. ఎప్పుడూ హాస్యంగా మాట్లాడుతూ హుషారుగా వుండేవాడు. కోలముఖం ఎప్పుడూ మురికిగా వుండేది. విశాలమైన నల్లని కళ్లలో ఎప్పుడూ ఏదో తెలియని ఆనందం తొంగిచూసేది. కారణం లేకుండానే వాడు సంతోషంగా వుండేవాడు; ఛలోక్తులు విసిరేవాడు, అందులోనూ ఎప్పుడూ ఏదో చిత్రంగా కొత్త విషయం చెప్పాలనుకునేవాడు. వాడు అందరికీ సహాయకారిగా వుండేవాడు, కబుర్లు అందించడానికిగాని, ఎవరేమని చెప్పినా చెయ్యడానికిగాని సర్వదా సిద్ధపడేవాడు. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ వుండేవాడు. హిస్సారియాకు వచ్చేవారందరికీ వాడు అభిమానపాత్రుడు. మాటలలో కుర్రతనం, చిలిపితనం, లోలోపల వ్యంగ్యం – యివన్నీ ప్రజలకు ఎంతో సంతోషం కలిగించేవి. వాళ్ళందరికీ వీడో కాలక్షేపంగా వుండేవాడు,

స్త్రీలు, ముఖ్యంగా అందమైన యువతులు వాడి దృష్టి నాకర్షించేవారు. వాళ్లలో చిలిపివాళ్లకు వాడు ప్రమాదకరమైన మనిషి. వాడికి గ్రహింపు శక్తి ఎక్కువ. హిస్సారియాలో ఎక్కడెక్కడి రహస్య గాథలు వాడికి తెలిసేవి. తెలిసినక్కువ వాడూ అమాయకుడూ గాబట్టి ఆ విషయాలగూర్చి పటపట వాగేవాడు. నలుగురికీ తెలిసిపోయేవి.

పాన్లెఫెర్టిగ్ ఎస్ అనే పట్టణమునుండి యిక్కడికి వచ్చాడు. వాడికి తల్లి మాత్రమే వుండేది. ఆమె కడు బీదరాలు. వాడిని వాడి కర్మానికి వదిలేసింది. వాడికొక తమ్ముడు కూడా వున్నాడు. వాడు ఇల్లు వదిలిపెట్టి ఎక్కడికో పారిపోయాడు. పాన్లెఫెర్టిగ్ హిస్సారియాకు వచ్చే యాత్రికులకు సాయపడుతూ, వారిని సంతోషపెడుతూ, వారిచ్చే డబ్బులమీద బ్రతికేవాడు. వాడు వారి మూటలు మోసేవాడు, వారికి వస్తువులు కొని తేవడానికి కార్లొవోకు నడిచి వెళ్లేవాడు. కోట ద్వారాలవద్ద వారందరికీ స్వాగతమిచ్చేవాడు. వారు వెళ్లేటప్పుడు వీడ్కోలు యిచ్చేవాడు. వాళ్లకు ఎంతో సాయపడేవాడు, పాటలు పాడేవాడు, మొగ్గలేసేవాడు, చేతులమీద తలక్రిందులుగా నడిచేవాడు—తరవాత టోపీ తిరగేసి పట్టుకునేవాడు, ఎన్నో చిల్లర డబ్బులు పడేవి.

పాన్లెఫెర్టిగ్ రైలుబండి నడకను అద్భుతంగా అనుకరించేవాడు (ఆ రోజుల్లో రైలు ఒక వింత). వాడు "ఫెర్టిగ్" అని కేకవేసి చేతులు ముందుకూ వెనక్కూ చాచుతూ మొదట్లో మెల్లగా బయలుదేరి క్రమంగా జోరుగా "జిఫ్‌జిఫ్" అంటూ యింజన్‌లా అరుస్తూ పరిగెత్తేవాడు. తరవాత క్రమంగా శబ్దం తగ్గిపోయేది. రైలుబండి స్టేషన్‌లో ఆగిపోయేది. హిస్సారియా నుండి యాత్రికులు బయలుదేరేటప్పుడు గుర్రపుబండి దగ్గర పాన్లె వుండవలసిందే. తన టోపీ తిరగేసి పట్టేవాడు డబ్బులు వేదేమని. బండి బయలుదేరే సమయానికి "ఫెర్టిగ్" అని కేకతో అర్డరిచ్చేవాడు. "ఫెర్టిగ్" అన్నది వాడి అభిమాన పదం. అందుకనే వాడికి పాన్లెఫెర్టిగ్ అని పేరు.

పాన్లెకి యింత ఎక్కువగా డబ్బులు దొరుకుతున్నప్పటికీ వాడెప్పుడూ చింకిబట్టలతో జోళ్లు లేకుండా ఆకలితో వుండేవాడు. ఎప్పుడూ దేనికీ ఒక కానీ అయినా ఖర్చు పెట్టేవాడు కాదు. ఎవరో యిచ్చిన చింకిబట్టలు వేసుకుని, యాత్రికుల ఆకులలో తిని వదిలేసిన ఆహారం తింటూ, ఊరిబయట తానే వేసుకున్న గుడిశలోనో లేకపోతే ఏ దుకాణం అరుగుమీదో, నిశ్చింతగా నిద్రపోయేవాడు. కొ

కలు లేకుండా, అపరిశుభ్రంగా, తత్వవేత్తలాగ నిత్యానందంగా వుండేవాడు. వాడి లోభత్వాన్ని చూసి ప్రజలు ఆశ్చర్యపోయేవారు. వాడు తన డబ్బంతటినీ తన కోటులో పెట్టి కుట్టేశాడనీ, లేకపోతే ఎక్కడో నేల పాతిపెట్టేడనీ కొందరనేవారు. ఇదంతా ఊహాగానమే, నిజానికి వాడు తన డబ్బును ఏం చేస్తున్నాడో ఎవరికీ తెలీదు.

అనేకసార్లు వాడి నీ విషయం అడిగారు. అపహాస్యం చేసేవారు.

"ఏంరా ఫెర్లిగ్, పెళ్లికోసం కూడబెడుతున్నావా డబ్బు? ఏంరా బికారీ! ఎక్కడ దాచేవు డబ్బంతా?"

"అదిగో అక్కడికే — భగవంతుడి దగ్గరికే నా డబ్బంతా పంపుతున్నాను. సరే, స్విస్ రాజ్యం వర్ధిల్లుగాక!" ఫెర్లిగ్ అనేవాడు వాడు.

ప్రపంచ భూగోళం గురించి వాడికి తెలిసినదల్లా స్విట్జర్లెండ్ పేరొకటే. వాడి మనసులో యీ పేరు, లోకంలోవున్న సుందరమూ, ఉదాత్తమూ, జ్ఞానప్రదమూ, అయిన సమస్తానికీ సంకేతంగా వుంది.

"ఇమె నిజంగా ఒక స్విస్ వనిత! హా! హా! ఎంత చక్కగా వుంది!" అని, అందమైన స్త్రీ కనిపిస్తే హుషారుగా అనేవాడు.

పాల్లెకు నేనంటే ఒక విధమైన గౌరవం ఏర్పడింది. అందుకు వాడు నన్ను స్విస్ అనేవాడు, నాకు కనిపించినప్పుడల్లా వాడు నన్నిలాగే అనేవాడు. వాడి మొఙ్గలూ కుప్పిగంతులూ చూస్తే నాకు సంతోషం కాక, విచారమేసేది. ఈ ఇరవై సంవత్సరాల కుర్రవాడు మానసికంగా వికలుడై, పనిలేనివారి ఆనందానికి ఆస్కారమై సమాధానంలేని ఒక చిక్కు సమస్యలాగ, ఒక పీడకలలాగ నాకగుపిస్తాడు. పరుల ఆనందానికి హేతువైన వీడి దురదృష్టంకంటె నికృష్టమైనది మానవాత్మకు వేరొకటి లేదు. నిలకడ కోల్పోయి, వివేకపు కాంతికిరణ మొకటైనా జొరబడని కారుమబ్బులలో కప్పడిన రోగగ్రస్తమైన పాల్లె మనస్సు స్వేచ్ఛగా నవ్వగలదు, నవ్వించగలదు. అది విషాదభావాలను పారద్రోలుతుంది. ఇంతకీ వాడు ఆనందంగా వున్నాడా? లేదా? నోటికొచ్చినట్టు మాటాడే యీ మోటు చలోక్తుల వెనుక, యీ మూర్ఖ హృదయపు మడతలలో ఎక్కడైనా ఏవైనా ఉదాత్త మానవతా భావాలుగాని పొంచివున్నాయా? ఏమో ఎవరికి తెలుసు - బహుశా ఏమీ లేకపోవచ్చును. వాడికి ఆత్మ చైతన్యమే లేనప్పుడు తన మానసిక స్థితి వాడెలా ఆలోచించగలడు? అయినా వాడెప్పుడూ ఆనందంగా వుంటాడు హాస్యగాడిలా ఎప్పుడూ కుప్పిగంతులువేస్తూ, ప్రజలను నవ్విస్తూ వుంటాడు. ఇందుకు వాడికి లభించే ప్రతిఫలం వాళ్ళిచ్చే డబ్బులే. అయితే వాడా డబ్బును ఎప్పుడూ ఖర్చు పెట్టుకోనేలేదు.

ఒకరోజున ఒక విచిత్ర సంఘటన జరిగింది. అది పాల్లెను నా దృష్టిలో ఎంతో వున్నతంగా లేవనెత్తింది.

ఒకనాడు నేను ఒక హోటలులో కూర్చుని, సిగరెట్టు కాల్చుకుంటూ, దూరాన ఆకాశానికి లేచిన పురాతన కోట గోడలవేపు చూస్తున్నాను. గడచిన యుగాల చరిత్రనూ, వాటి వైభోగాన్ని నాకు జ్ఞప్తికి తెచ్చాయా గోడలు.

హఠాత్తుగా పాల్లె నవ్వుకుంటూ నా ముందుకొచ్చి నిలబడ్డాడు. వాడు జాగ్రత్తగా చుట్టూ ఒకసారి చూశాడు.

"ఎవరికోసం చూస్తున్నావు పాల్లె?"

"మీ కోసమే — కాని యితరులెవరైనా యిక్కడున్నారేమో అని—" అన్నాడు వాడు.

"ఏం ఎందుకూ?"

"ఇక్కడెవడైనా తెలివితక్కువ వెధవ వుండవచ్చును గదా."

"ఇక్కడ స్విస్ మనుషులు — నువ్వూ, నేనూ తప్ప మరెవరూ లేరు" అన్నాను నేను నవ్వుతూ.

పాల్లె తన చింకికోటు జేబులో చెయ్యిపెట్టి ఎడ్రసులేని కవరు ఒకటి పైకితీశాడు. "ఎలాప్రాంగా అని వ్రాయడం మీకు వచ్చునుగదండీ" అన్నాడు.

"ఏమిటా వుత్తరం?"

"ఇది స్విస్ రాజ్యానికి పంపాలి — హా-హా-హా!" అంటూ ఒక్క గెంతుగెంతేడు వాడు. ఆ వుత్తరం నా చేతికిచ్చేడు.

"ఇక్కడ మా తమ్ముడి పేరు ఎలాప్రాంగా అని వ్రాయండి."

"సరే బాగుంది. కాని యీ వుత్తరం ఎక్కడికి వెళ్లాలి?"

"స్విస్ రాజ్యానికి లోపలి వుత్తరమంతా మట్యూమాను వ్రాశాడు. పై విలాసం వ్రాయడం వాడికి చేతకాదు, వాడొక మొద్దు."

"స్విట్జర్లండ్, అంతేనా ఏం? అక్కడేనా? నీ తమ్ముడున్నది?" అని అడిగాను. స్విట్జర్లెండ్ అంటే యీ పాల్లెకు ఎందుకంత గౌరవమో నాకు వెంటనే స్ఫురించింది.

"ఏ పట్టణంలో వున్నాడు నీ తమ్ముడు?"

"ఫ్రీబర్గ్ అని వ్రాయండీ."

వాడు చెప్పినట్టుగానే వ్రాశాను, ఫ్రెంచి భాషలో ఎడ్రసు వ్రాశాను. పాల్లె అడ్రసులోని మాటలన్నీ సరిగ్గా వుచ్చరించడం, జ్ఞాపకముంచుకోవడం చూస్తే కొంత ఆశ్చర్యమేసింది.

"ఓ చాల బాగుందండీ. స్విస్ పెద్దమనిషంటే నీలా వుండాలి!" అంటూ నన్ను పొగిడాడు.

"మీ తమ్ముడక్కడ ఏం చేస్తున్నాడు?"

"వాడు స్కూలులో తెలివితేటలు సంపాదిస్తున్నాడు."

"వాడేమిటి చదువుతున్నాడు?"

"డాక్టర్లు చదివే చదువు."

"అద్భుతంగా వుంది!"

"ఈ సంవత్సరంతో, వాడి చదువు పూర్తవుతుంది. వాడిక్కడికి తిరిగి వచ్చేస్తాడు. ఎవడికి రోగమొచ్చినా వాడు బాగుచేస్తాడు."

చేతిలో రెండు రింగులు తమాషాగా ఎగరేసి పట్టుకున్నాడు పాల్లె – నా చేతిలోని వుత్తరం తీసుకున్నాడు, వెళ్లడానికి.

"ఓ నిముషముండు. ఏమిటో తొందర పాల్లె!"

వాడు ఎదురుగుండా వున్న హోటలు వేపు చూపించాడు. అక్కడ ఆవరణలో చెట్లనీడను చాల మంది స్త్రీ పురుషులు కూర్చుని వున్నారు.

"నేనక్కడికి వెళ్లి స్లావ్‌దిన్ రైలుబండిని నడిపించాలి–" అంటూ నవ్వేడు వాడు.

"మీ తమ్ముడి కేమిటి వ్రాశావు?"

"శుభాకాంక్షలు – కాని అదేం పరిపోతుంది!"

"అహా! హా!"

"మీ తమ్ముడికి డబ్బుందా?"

"వాడికా! ఒక దమ్మిడీ కూడా లేదు."

"వాడికి స్కాలర్‌షిప్ గాని వుందా?"

"అంటే ఏమిటి?"

"ప్రభుత్వం వాడికి వుపకారవేతనం యిస్తూందా?"

"అబ్బె లేదండీ – దేవుడే యిస్తున్నాడు."

"ఎలాగది?"

"దేవుడో – మూర్ఖుడో ఎవడో ఒకడు."

నాకు ఏమీ బోధపడలేదు. "పాల్లె సరిగ్గా జవాబు చెప్పవేమీ? తెలివితక్కువగా మాట్లాడకు" అన్నాను నేను చిరాకుగా.

"నేను చెప్పేను గదండీ, చెప్పలేదూ? ఫ్లెర్టిగ్. ఫ్లెర్టిగ్... పఫ్... పఫ్... పఫ్" అంటూ రైలు బండిలా అరుచుకుంటూ ఎదురుగుండావున్న జనం వేపుకు వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రం దుకాణదారుడు మట్యూను చూశాను. వాడు పాల్లెకి బంధువు. పాల్లె తెల్పిన సూచనలను నేను సరిగ్గా అర్థం చేసుకున్నానో లేదో తెలుసుకోవాలనుకున్నాను. మట్యూకు అసలు విషయం చెప్పడం యిష్టం లేకపోయింది. కాని చివరికి యిలా అన్నాడు.

"వాడు తిడతాడు, ఎవరితో చెప్పవద్దని గట్టిగా చెప్పేడు, ఎందుకంటే అది వాడి తమ్ముడికి అగౌరవమవుతుందట. కాని మీకు నే చెబుతాను. నిజమే. తాను బిచ్చమెత్తుకుంటూ గడచిన రెండేళ్లనుండీ తన తమ్ముడిని పోషిస్తున్నాడు. మొదట్లో వాడి తమ్ముడి దగ్గర కొంతడబ్బు వుండేది. అది అయిపోగానే వాడు చదువు మానేద్దామనుకున్నాడు. కాని యీ విషయం పాల్లెకి తెలియగానే వాడు "వద్దు, ఎంత మాత్రం వద్దు. వాడు చదువు పూర్తి చేయవలసిందే" అన్నాడు. పాల్లె తనకోసం ఒక కానీ అయినా ఖర్చు చేయడు. తనకు దొరికిన డబ్బంతా తన తమ్ముడికి, వాడిని చదివించి ఒక మనిషిగా తయారుచేయడానికి, పంపిస్తున్నాడు. అయ్యో, చూశావా భాతృప్రేమ, వీడు మనలో చాలమందికంటె ఉత్తముడు."

ఎదురుగుండావున్న హోటేలువద్ద గల మనుషుల నవ్వులలో మట్యూ మాటలు కలిసిపోయాయి. అక్కడ పాల్లె చేతిలోని రింగులు గాలిలో ఎగరవేస్తూ గెంతుతున్నాడు.

# భగవన్నిర్ణయం కాక మరేమిటి?

శ్రీమతి చివుకుల లక్ష్మీపున్నయ్య

రమేష్ కాలేజిలో చేరినప్పటినుండి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేవాడు. వాళ్లది కడు బీదకుటుంబము. మంచి తెలివి తేటలు గలవాడు. చదువుపట్ల శ్రద్ధ, అతని కృషి అతనికి అన్ని పాఠ్యభాగాల పరీక్షల లోను మంచి మార్కులను తెచ్చిపెడు తూండేవి. విద్యార్థుల సంఘాల సమావేశా లలో విశేష విషయపరిజ్ఞానంతో అనర్గ ళంగా ఉపన్యసించేవాడు. సంగీత, సాహి త్యాలపట్ల అత్యంత ఆసక్తి కలిగి శ్రావ్యంగా పాడకలిగేవాడు. అతని ప్రజ్ఞావిశేషాలను చూచి కొందరు తోడివిద్యార్థులు అచ్చెరు పడుతుంటే మరికొందరు అసూయపడే వారు. మరికొందరు క్రమబద్ధంగా పాఠాలు చదువక అల్లరిచిల్లరగా తిరిగేవారు, అతని వాలకం చూచి పాఠ్యపుస్తకాలు తప్ప అతనికి మరొక ప్రపంచము తెలియదని హేళన చేస్తుండేవారు. రమేష్ మాత్రం ఎవరు ఏమనుకుంటున్నా చలించేవాడు కాడు. తన ధోరణే తనదికాని యితర జోక్యాలకు వెళ్లేవాడు కాడు.

ఆ క్లాసువిద్యార్థి, విద్యార్థినులలో రమేష్‌ను ఆదర్శనీయుడుగా గుర్తించిన వారిలో కమల యొకతె. అతని కళా పిపాస, మంచి గుణాలు ఆమెను విశేషంగా ఆకర్షించినవి. అతనిని ప్రేమించి జీవిత భాగస్వామిగా ఎన్నుకొంది. కాని అతనితో పరిచయం తనకు ఎలా లభిస్తుందా యనే ఆరాటం దినదినానికి అధికం కాజొచ్చింది. అతనిని పలుకరించి మాట్లాడుదామన్నా అతని సంభాషణ బహు ముక్తసరిగా నుండేది. అతని వాలకం, ధోరణి అతనిని ప్రపంచములో ఏదీ చలింపజేయలేదేమో ననిపించేది. అది మరీ కమలలో ఆవేదనను, ఆసక్తిని రేకెత్తింపజేసినవి. పరీక్షలయి పోయి శలవలివ్వగానే రమేష్ స్వగ్రామాని కెళ్ళడానికి ప్రయాణమయ్యాడు. ఆ సెలవులలో కమలకు వివాహం చేయాలని తల్లిదండ్రులు సంకల్పించారు.

కాలేజి వార్షికోత్సవానికి బ్రహ్మాండమైన ఏర్పాటులు జరిగాయి. కాలేజి విద్యార్థులు, విద్యార్థినులందరు ఉత్సవంలో పాల్గొనడానికి వచ్చారు. ప్రతియొక్కరి దృష్టి సంగీత, నృత్య వినోదప్రదర్శనముల వైపు కేంద్రీకృతమైయుంది. ఇంతలో ఆ సమూహంలో స్త్రీలు కూర్చున్నచోట ''పాము, పాము'' అనే కేకలు, గల్లంతు ఏర్పడింది. రమేష్ అక్కడికి ఒక్కుమ్మడిగా పరుగెత్తివెళ్ళి పామును బడితెతో కొట్టి చంపాడు. ప్రక్కనే స్పృహతప్పి పడియున్న కమలను చూచి చాలమంది ఆమెకు పాము కాటు ప్రమాదం ఏర్పడిందేమోనని విచారించసాగారు. డాక్టరు వచ్చి చూచి ప్రమాదమేమి లేదని చెప్పి చల్లని నీరు ముఖంమీద చల్లిన తరువాత కమల తెప్పరిల్లి చూచేసరికి ఎదురుగా

రమేష్, చుట్టూ యితర విద్యార్థులు గుమికూడి యున్నారు. సిగ్గుతో తలవంచుకుంది. తల్లిదండ్రులామెను మెల్లగా యింటికి తీసికొని వెళ్లారు.

మరునాడు రమేష్‌కు ఒక జాబు వచ్చింది. అందులో పామును సకాలములో కొట్టి చంపి కమలను రక్షించినందుకు ఆమె తండ్రి కృతజ్ఞతను తెలుపుతూ ఆ సాయంకాలము తమ యింటికి తేనీటి విందుకు ఆహ్వానించాడు. రమేష్ ఆ యాహ్వానాన్ని స్వీకరించి వాళ్ళ యింటికి వెళ్లాడు.

కమల చక్కగా ముస్తాబై తండ్రితో పాటు రమేష్‌కు స్వాగతమిచ్చింది. 'టీ త్రాగుతూ మాటల సందర్భమున "కమలకు యీ సెలవులలో పెండ్లి చేయదలచుకున్నాము రమేష్" అన్నాడు.

"మంచిది - కాబోయే అల్లుడు ఏమి చేస్తున్నారండీ! బాగా ఉన్న కుటుంబమేనా!"

"ఏదీ - ఎక్కడా సంబంధమంటూ నిశ్చయం కాలేదు. అయినా ఆస్తిపాస్తులతో మాకంతగా పట్టింపు లేదు. ఈడు జోడుగానుండి చదువుకున్న వాడైతే సరి- భగవంతుడు నాకేదో ఏలోటు లేకుండా యిచ్చాడు. నాకు కమల తప్ప మరే సంతానంలేదు. ఉన్న దేదో వాళ్ళ భార్యాభర్తలదే కదా!" అన్నాడు.

రమేష్ ఆ మాటలకేమి మాట్లాడలేదు కాని కమల తన్ను ప్రేమిస్తున్నదని తెలిసి యున్నా సంపన్నుల యింటి పిల్లను తనకిచ్చి వివాహం చేస్తారని ఎలాగనుకో కలుగుతాడు!

కమల మాత్రం రమేష్ తండ్రితో మాట్లాడుతున్నంత సేపూ అతని ముఖలక్షణాలనే గమనిస్తుండింది.

"మీరు మీ వివాహాన్ని గురించి ఏమి నిర్ణయించుకో లేదా యింకా" అన్నాడు కమల తండ్రి.

"లేదండీ! - ఉద్యోగం సద్యోగం లేకుండా తొందరపడి వివాహం చేసికుంటే నా బోటి వాడు సుఖపడ గలిగే దేముంటుంది!"

"దానికేంలే! మా యింటి అల్లుడు కావడానికి మీకేమైనా అభ్యంతరమా?"

రమేష్ ముఖం వికసించింది. ఆ సందట్లో కమల మెల్లగా ప్రక్కగదిలోకి జారుకుంది. రమేష్ తలవంచుకొని మారుమాట్లాడలేదు. తర్వాత నెలరోజులకు సుముహూర్తాన కమల, రమేష్‌లకు వైభవంగా వివాహం జరిగింది. కమల తన మనోరథసాఫల్యానికి ఉప్పొంగిపోయింది.

పెండ్లయాక మొదటి సంక్రాంతి పండుగకు రమేష్ అత్తగారింటికి వచ్చాడు. ఆ రాత్రిపడుకోబోతూ భర్తతో "మీరు ఎందుకైనా బయటికి వెళ్లాల్సివస్తే నన్ను లేపండి ఒంటరిగా మాత్రం వెళ్లద్దు - బయటకుక్కలున్నవి" అని చెప్పింది కమల.

రమేష్ "అటువంటి అవసరముండదు సాధారణంగా" అని నిద్ర పట్టించాడు. కాని అర్ధరాత్రివేళ లేచి బయటికి వెళ్లాల్సి వచ్చిందికాని కమల చెప్పినమాట మరచి

పోయి గదితలుపు తీసి ఎవరిని లేపకుండానే బయటికి, వెళ్లాడు రమేష్. కొంతసేపటి కంతా "అమ్మయ్యో!"అన్న కేకలకు నిద్ర నుండి మేల్కొని కమల తన ప్రక్కన భర్త లేక పోయేసరికి తండ్రిని, పాలేరను లేపి లాందరతీసికొనిపోయి చూద్దురు గదా రమేష్ రక్తసిక్తమయిన అవయవాలతో మూల్గుతూపడియున్నాడు. రెండుకుక్కలు తోకలాడిస్తూ దగ్గరవచ్చి నిలబడ్డవి. వెంటనే డాక్టరును పిలిపించగా ఆయన వచ్చిచూచి లాభంలేదని పెదవివిరచాడు. తర్వాతకొన్ని నిముషాలకు రమేష్ ప్రాణ వాయువులు అనంతవిశ్వంలో కలసి పోయాయి.

ఇంటిల్లిపాది గొల్లుమన్నారు కమల కుప్పకూలిపోయింది. హృదయం బ్రద్దలై క్రిందవాలిపోయింది. కమల, రమేష్‌ల సమాధులు ఆనాటికి యీనాటికికూడ మా యూరి ప్రక్కగా పోయేరైలుమార్గం ప్రయాణీకులను ఆకర్షిస్తుంటవి.

---




# చేయతగని పని చేస్తే...

కుమారి చివుకుల రమాదేవి

లలిత, శివరాం చదువుకుంటున్నా లలితకు చదువుకోడమంటే చాల శ్రమగా నుండేది. శివరాం మంచి తెలివితేటలు కలవాడే కాని ఎప్పుడూ ఆటలమీద, అల్లరిచేయడంమీద ఆసక్తే కాని కుదురుగా కూర్చొని యింట్లో చదువుకునేవాడు కాడు. వాళ్లమ్మ, నాన్న ఎంతగానో కొట్టేవారు, తిట్టేవారు కాని శివరాం మాత్రం చెప్పిన మాటలు వినేవాడు కాడు.

లలిత పుట్టినరోజు పండుగ వచ్చింది. అమ్మమ్మ, తాతయ్య, మేనమామలు వచ్చి ఆశీర్వదించారు. పెద్ద మేనమామ పుట్టినరోజు బహుమానంగా స్కూలుకు పుస్తకాలు పెట్టుకొని వెళ్లేసంచి, బిస్కట్లు, యింకా అనేకం తెచ్చియిచ్చాడు. ఆరోజున యిల్లంతా సంబరంగా విందులతోటి కళకళలాడింది. మరునాడు వచ్చిన బంధువులు యూరికి వెళ్లిపోయారు.

లలితను పిలచి వాళ్ళమ్మ "చూడమ్మాయ్! మామయ్య నీకు పండుగ బహుమానం తెచ్చియిచ్చాడు కదా – నీవేమైనా ధన్యవాదాలు తెలిపావా?" అని అడిగింది.

లలిత తల గోక్కుంటూ "ఏమిటమ్మా అది!" అన్నది.

"మనకు ఎవరైనా ఏదైనా ఉపకారం చేసినా, ఏదైనా బహుమానం తెచ్చియిచ్చినా మనం కృతజ్ఞత చూపాలి. దానినే ధన్యవాదాలంటారు. ఇంగ్లీషు బాలబాలికలు 'Thanks' అంటారు" అన్నది.

"నాకవన్నీ తెలియవమ్మా!"

"నేర్చుకోవాలి. ఈవేళ మామయ్యకు ఒక జాబు వ్రాయి. అందులో నీ ధన్యవాదాలు తెలుపు."

"నేను వ్రాస్తే చాల తప్పులుంటవమ్మా! నీవే వ్రాయకూడదూ!"

"బహుమానం తీసికున్నది నీవూను, ధన్యవాదాలు తెలిపేది నేనూనా! బాగుంది! మెల్లగా తప్పులు లేకుండా వ్రాయ నేర్చుకోవాలి! బడికి వెళ్ళి చదువుకుంటున్నావుకదా – ఆ మాత్రం వ్రాయలేకపోతే ఎలాగ?" అని కాగితము, పెన్సిలు తెచ్చియిచ్చి వాళ్ళమ్మ మార్కెటుకు వెళ్ళింది.

జాబు వ్రాయడానికని టేబిలు ముందు కూర్చున్నది ఇంతలో శివరాం వచ్చి "లల్లూ! పెన్సిలుతో వ్రాస్తే బాగుండదు – స్టాక్ కలంతో వ్రాయి" అని కలం అందిస్తాడు.

పాపం ఎంతో ప్రయాసపడి జాబైతే వ్రాసింది కాని వంకర అక్షరాలు, సిరా మరకలు దాన్ని అసహ్యంగా చేసినవి. కాని అమ్మ దానిని చూచి కోపగిస్తుందని భయపడి దానిని మడిచి కవరులో పెట్టి అంటించేసింది. పైన వంకరటింకరగా అడ్రసు వ్రాశాడు శివరాం.

"అన్నయ్యా! యీ జాబును తపాల పెట్టెలో వేసి రారా."

"అమ్మకు చూపించకుండా వేస్తే తిట్టదూ! – నేను వేయను."

"ఏం తిట్టదులే నువ్వు – ఆమె వ్రాసి వెయ్యమన్నదిగా."

"చూడు లల్లూ! ఒక పని చెయ్యి – అమ్మ వచ్చేసరికి కవరును లక్కతో సీలు చేశామంటే అమ్మ వచ్చి లోపల జాబు చూడకుండానే తపాలా పెట్టెలో

వేయమంటుంది. దానివల్ల జాబు అసహ్యంగా నున్న దని నిన్ను తిట్టదముండదు" అన్నాడు శివరాం.

మంచి ఉపాయమనుకున్నది. వాళ్ళ నాన్నగారి డ్రాయరునుండి లక్క తెచ్చింది. శివరాం నిప్పుపెట్టె తెచ్చి పుల్లను గీచి లలిత చేతిలోని లక్కకు శగ చూపసాగాడు. ఆ సందర్భంలో లలిత చేయి కాలి అమ్మా! అంటూ లక్కముక్కను క్రిందపడేసి గంతేసింది. శివరాం గాబరాతో వెలుగుతున్న నిప్పుపుల్లను టేబిలుమీద వదిలేశాడు. ఆ నిప్పుకు టేబిలుమీద కాగితాలు అంటుకొని మండసాగినవి. లలిత భయభ్రాంతురాలై బయటికి పారిపోయింది. శివరాం పారిపోయి ప్రక్క యింటివారిని పిలుచుకొని వచ్చేసరికి సగం పుస్తకాలు, దాంతోబాటు లలిత వ్రాసిన జాబు కాలిపోయినవి. నీళ్లుచల్లి ఎలాగైతేనేం మంటల నార్పేశారు.

కొంతసేపటికంతా వాళ్ళమ్మ వచ్చిచూచి దిగాలు పడింది. జరిగిన విషయమంతా లలిత పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

"అదృష్టం బాగుంది - లేకుంటే యిల్లు తగులబడిపోయి యుండేది. అందుకనే చిన్నపిల్లలు నిప్పు దగ్గరకు వెళ్ళకూడదని, నిప్పుపెట్టె గీయకూడదని అనేకసార్లు చెప్పేవాన్ని. నీవుచేసిన తప్పును మరుగుపరచడానికి ప్రయత్నించబోయి ఎంత ప్రమాదం కలిగించారో చూడండి! మామయ్యకు జాబు వ్రాయడానికి నన్నడిగితే నేను సహాయపడనూ! తెలియని దానిని యితరుల నడిగి తెలిసికోవాలి కాని పొరబాట్లను మరుగుపరచుకో ప్రయత్నించకూడదు. పిల్లలు ఏ పనులైతే చేయకూడదని తల్లిదండ్రులు చెప్తారో వానిని చేయపూనుకుంటే యిప్పటిలాగే ఆపదలొస్తవి. ఇకమీదనైనా చెప్పినమాట విని జాగ్రతగా నుండండి!" అన్నది లలిత అమ్మ.

శివరాం రాత్రి వాళ్ళనాన్న వచ్చి కొడ్తాడో, తిడ్తాడోనని పుస్తకం చేతబట్టి బల్లమీద కూర్చొని మంచిపిల్లవాడిలాగ చదువుకోసాగాడు.

—(o)—

# బ్రతికి బయటపడ్డ నక్క!

కుమారి పి. అనసూయ

ఒక అడవి. ఆ అడవిలో ఒక సింహం ఉండేది. కొన్నాళ్ళకి ఆ సింహం ముసిలిది అయిపోయింది. వంట్లోశక్తి చచ్చింది. జంతవుని వేటాడగల బలం సింహంలో యిప్పుడు లేదు. ఆ కారణం చేత అది తిండి లేక పస్తులు వుండవలసి వచ్చింది.

సింహం బాగా ఆలోచించింది. దానికో ఉపాయం తట్టింది! ....

ఆ అడవిలో పెద్ద కొండగుహ ఒకటి వుంది.

సింహం ఆ గుహలో ఉండటానికి నిశ్చయించుకుంది.

మరిదానికి ఆహారం? ...

ఏ రాత్రి పూటు అయిన ఒక్క జంతు వయినా ఆ గుహలోకి వెళ్ళేది. వెంటనే దానిమీదపడి .... చంపి తింటూ వుండేది సింహం!

ఎలా లేదన్నా రెండురోజులకు ఒక్కసారి అయినా సింహానికి ఆహారందొరకుతూ ఉండేది.

ఇలావుండగా; ఓ నాడు ఓ నక్క ఆ దారంటవచ్చింది.

నక్కకి ఆ అడవి కొత్త. ఆ అడవిలో నివాసం ఏర్పరుచుకొందామనివచ్చింది.

కొండగుహ కనిపించేసరికి అందులోనే ఉందామని నిశ్చయించుకుంది.

సంతోషంగా ... నవ్వుకుంటూ లోపలికి బయలుదేరింది.

తీరా, గుమ్మందాకా వెళ్ళి.. టక్కున ఆగిపోయింది!

"ఈ గుహలోనికి జంతువులు ఏవో వెళ్ళిన అడుగుజాడలే ఉన్నాయి కానీ.... అవి తిరిగి వచ్చినట్టులేదే!" అనుకుంటూ వెనక్కివచ్చింది.

దాని ఊహే నిజం అయింది.

జంతువుల అడుగు జాడలన్నీ గుహ లోపలికే వున్నాయికాని. బయటకిలేవు!....

'ఐతే, యిందులో జంతువులకు హాని చేసే జంతువేదో ఉందన్నమాట!' అనుకుంటూ, గుహవైపుతిరిగి చూడకుండా పరుగుతీసింది.

ప్రాణాలు దక్కించుకుంది.

అందుకే 'ముందు ఆలోచనవుంటే అపాయం ఉండదు!' అంటారు పెద్దవాళ్ళు!

---

## బోదకాలు వ్యాధికి నూతన ఔషధం

వాషింగ్టన్ - ఉష్ణమండల ప్రాంతాల్లో 25 కోట్లకు పైగా ప్రజలను పీడిస్తున్న బోదకాలు (ఫైలేరియాసిస్ లేదా ఎలిఫెంటియాసిస్) వ్యాధి నిదాన చికిత్సలలో పనికివచ్చే నూతన ఔషధాన్ని కని పెట్టారు. చర్మం క్రింద జీవించేదారం పోగుల్లాంటి సూక్ష్మ జీవులను (ఫైలేరీ) అల్ట్రా వయొలెట్ కాంతిలో పసిమి బంగారు వన్నెగా మెరిసేటట్టు ఆ క్రిమిఘ్ని చేయగలదు. ఆ నూతన ఔషధం "టెట్రాసైక్లిన్"ను 15 ఏళ్ల బాలికకు ఉపయోగించి చూచామని నేషనల్ హెల్త్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన డాక్టరు జాన్ ఇ. టోబీ, డాక్టరు హెన్రీ కె. బేయి తెలియజేశారు. చీకటి గదిలో అల్ట్రా వయొలెట్ కాంతిలో ఆమెను పరీక్షించినప్పుడు, సాధారణంగా నీల వర్ణంలో మెరిసే ఆమె శరీరం ఆ చిన్నిచిన్ని పురుగులు గల చోట పసిమిబంగారంలా మెరిసింది. ఆ మందు చుట్టు ప్రక్కల ధాతువులను వదిలిపేసి ఆ పురుగుల పైనే ఎక్కువగా పనిచేయ ప్రారంభించింది. అందువల్ల, టెట్రాసైక్లిన్‌తో మరో ప్రబల ఔషదాన్ని సమ్మిళితంచేసి వాడినట్లయితే పరాన్న భుక్కులైన ఆ క్రిములు నాశనమై పోగలవని ఆ పరిశోధకులు ఒక నిర్ణయానికి వచ్చారు.

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 23

సంధ్యాసమయపు కమలములాగ కమల ముఖంకూడ ముడుచుకుపోయింది. చేతిలోని ఉత్తరాన్ని మాటి మాటికి చదువుతూ యెదురుగావున్న రోడ్డువైపు చూస్తోంది. ఇంకా చాల ప్రొద్దు వుంది. కాని యీమె మాత్రం చూసిచూసి విసిగిపోయింది. మళ్లీ ఉత్తరాన్ని ఒకసారి చూచి లోపలికి వెళ్లి లెటర్ పాడ్ పట్టుకొచ్చి, ఆలోచిస్తూ ఉత్తరం వ్రాయడం మొదలుపెట్టింది. అయితే యేమని వ్రాయడం? అసలు వ్రాసే విషయమేమిటి? ఆమెలో హడావిడి యెక్కువైంది. ప్రతి స్త్రీ హృదయంలోను ఏదో ఒక పురుషునిమీద విరోధ భావం వుంటూనే వుంటుంది - అల్లాంటి మధురమైన భావంలో వ్రాయడం మొదలుపెట్టింది. ప్రతి విషయంలోను తండ్రిద్వారా అతనికి సహాయం చేయిద్దామనుకుంటుంది. కాని - ఒక్కసారి అవతలివాళ్లు వచ్చి తండ్రిని కల్సుకుంటే మంచిదేమో? పోనీ, ఒకవేళ టైముపుండి వాళ్ళకు అదృష్టమే వున్నట్లైతే యీ వుత్తరమే అంతాపని చేస్తుంది - అనుకుంటూ వుత్తరం ముగించి మడచి కవరులో పెట్టి రోడ్డువైపు చూచింది. కుమార్ రావడం చూచి సంతోషంతో ఉప్పొంగిపోయింది. లేచి ముందుకు అడుగు వేసేసరికల్లా కుమార్ రానే వచ్చాడు గుమ్మంలోకి.

"ఏమండీ! అప్పుడే నాలుగైంది. ఇప్పుడు బయల్దేరే మాటైతే కాన్పూరు వెళ్ళి రాత్రికి వచ్చెయ్యవచ్చు" అంది అతడి ముఖంలోకి చూస్తూ.

"అబ్బే - ఎక్కడికీ వద్దండీ" అన్నాడు. అసలు కమల అభిప్రాయం కాన్పూరు వెడదామని కాదు — ఇద్దరూ కలిసి యెక్కడికైనా షికారు వెడదామని. అతడి సమాధానానికి వచ్చే నవ్వును ఆపుకుని, అతణ్ణి కుర్చీలో కూర్చోమని తాను ఎదురుగా మరొక కుర్చీ మీద కూర్చుంది అతణ్ణి చూస్తూ. కుమార్ కూర్చున్నాడన్న మాటేగాని అతడి మనసులోవున్న రూపాన్ని చూచుకుంటూ కలవరపడుతున్నాడు. కాని యెదురుగావున్న కమల మాత్రం అతణ్ణి చూస్తూ ఊహా చిత్రాలు చిత్రించుకుంటూ గాలిమేడలు కట్టుకుంటోంది. రోజూకంటె ఆరోజు అతనిలో యేదో ఆకర్షణ ఆమెకు కన్పిస్తోంది. అతణ్ణి చూస్తుంటే ఆమెలో స్నేహసౌహార్ద్రాలు ఉప్పొంగాయి. ఆమె ఆలోచనలు, భావాలు తరంగాల్లో తేలిపోతున్నాయి. ఏదో తెగని సంబంధం యిద్దరి మధ్య యేర్పడబోతూంది. ఆమె యేదో ఊహకు అందని ఆనందడోలికల్లో ఊయలలూగుతూ "ఏమండీ — నడవండి ఎయిరోడ్రోముకు వెళ్లివద్దాం" అని నౌకర్ని పిలిచి కారు తీసుకురమ్మనమంది. కుమార్ మాట్లాడకుండా నిర్వికారంగా కూర్చున్నాడు.

డ్రైవరు కారుతీసుకువచ్చి గుమ్మంలో పెట్టాడు. కమల లేచి కుమార్‌ను రమ్మనమంది. కుమార్ యేదో ఆలోచిస్తూ లేచివెళ్లి ముందు సీట్లో డ్రైవరు ప్రక్కన కూర్చొన్నాడు. అదిచూచి కమల మనస్సు చివుక్కుమంది. తానే తలుపు తీసుకుని వెనకసీట్లో కూర్చుని దభాలుమని తలుపు వేసింది. కారు కదిలిపోయింది. ఆమె ఆలోచించింది. ఏం? ఇక్కడ కూర్చుంటేం? మనిషి తగలకూడదా? అనుకుంది.

కుమార్ కూర్చున్నాడేగాని మనసు మనసులో లేదు. ఊహాప్రపంచంలో కళ్ళముందు నిరు పెళ్లిని చిత్రించుకుంటున్నాడు. నిరు ముఖం ఉదయభానుడిలా కన్పించింది. లతల మధ్యలో వున్న ముఖాన్ని చూస్తున్నాడు. కలువల్లాంటి ఆమె కళ్లు లతల మధ్యనుండి కన్పించేసరికి ఏమిటో తెలియని బాధపడ్డాడు. ఆనాడు బూటుపాలిష్ చెయ్యడానికి వాళ్ళింటికి వెడితే యెంత తొందరగా ముందుకు వచ్చింది! ఆమెను ఆపేవాళ్లెవ్వరూ లేకపోయారు. ఆమె కళ్లు తనవైపే చూస్తున్నాయి. ఆ కళ్లలో యెంత ఆకర్షణ! ఆలోచిస్తూ చీకట్లు క్రమ్మిన కళ్ళను నలుపుకుని తేరపారి చూచాడు. ఎదురుగా నిరుపమ యేది? అంతా కల!

విమానాశ్రయం వచ్చేసింది. కారు ఆగగానే

కమల దిగి కుమార్ కూర్చున్న తలుపు తీసింది. కాని ఆలోచనలో పడ్డ కుమార్ యిది గమనించక అట్లాగే కూర్చున్నాడు పరధ్యానంగా. "సార్. ఆలోచిస్తున్నారా? నిద్రపోతున్నారా?" అంది.

ఆ మాటకతడు అదిరిపడి చిరునవ్వుతో క్రిందకు దిగాడు. ఆకాశంలో విమానం యెగురుతోంది. అందరూ దాన్నిచూస్తూ నిలబడ్డారు. కమల అతడి ప్రక్కగా జరిగి - "యిక్కడ చాల గుంపుగా వుంది. బహుశా మనకు ఆలస్యమౌతుందేమో?" అంది. విమానం క్రిందకు దిగగానే కమల, కుమారు లిద్దరూ దానివైపే చూస్తూ ఆశ్చర్యపోయారు. నిరు, యామినీబాబు విమానం దిగి వీరివైపే వస్తున్నారు. అయితే వాళ్ళిద్దరూ వీళ్ళను చూడలేదు. దగ్గరగా వచ్చిన తర్వాత నిరుపమ కుమార్ బాబు ప్రక్కనున్న కమలను చూచి ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది. అలా ఆమె పెడముఖం పెట్టడం వీరిద్దరికీ దెబ్బకొట్టినట్లైంది. నిరుపమను కల్సుకోవాలని వున్నప్పటికి నిగ్రహించుకుని కమల యేదో కీటకాన్ని చూచునట్లుగా యామినీబాబువైపు చూచింది. కుమార్ కమలను పెళ్లి చేసుకుంటున్నాడన్న భావంతో యామినీబాబు కుమార్‌ను చూచాడు. ఎదురుగా వచ్చి, అపహాస్యంగా నవ్వుతూ, కుమార్‌ను అడిగాడు — "ఏమండి, మీరిప్పుడు బూట్ పాలిష్ చెయ్యడం మానేశారా?"

"మీలాంటివారికి నేర్పవలసిన పాఠం పూర్తయింది" అన్నాడు కుమార్ చిరునవ్వుతో.

"మిగతాది యేమైనా వుంటే నేను పూర్తిచేస్తాను" వెంటనే అంది కమల.

ఆ మాటలకు యామినీబాబు అదిరిపడ్డాడు. అయినా ఆమె మాటల అర్థాన్ని గ్రహించలేకపోయాడు. రకరకాల అర్థాలు చెప్పుకోవడం మొదలుపెట్టాడు. నిరు మాత్రం బాధపడినట్లుగా కన్పించింది. వాళ్ళిద్దరూ యామినీబాబును యేడిపించడం బాగానేవుంది. కాని అతనితో వచ్చి కుమార్‌ను చిన్నబుచ్చడం ఆమెకిష్టంలేదు. ఒక్కసారి కమలవైపు చూచింది. ఆ ముఖంలో ఆనందమనేది ఎక్కడా ఆమెకు కన్పించలేదు. ఏదో ఆవేదన మాత్రం కన్పించింది స్పష్టంగా. కమల ఆమె ముఖంలోకి చూచి ఆలోచించింది. ఒకవేళ నిరుపమ కుమార్‌ను ప్రేమించకపోతే అతని ప్రక్కనేవున్న తనను చూడగానే యెందుకు ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది? ఆమెకు యామినీబాబంటే యిష్టం లేదేమో? ఇదివరకు ఆమె చెప్పినమాట గుర్తు చేద్దామనుకుంది. అందరి ముఖాలు పరీక్షగా చూచి. ఆలోచించింది - "అవును. ఇది సంభవమే. దెబ్బతగిలి గాయపడిన చోటనే తిరిగి దెబ్బ తగులుతూ వుంటుంది. గోరు చుట్టుమీదే రోకటిపోటు... అది మంచిది కాదు" అనుకుంటూ కుమార్‌ను వదలి యామినీబాబుకు ప్రక్కగా వెళ్ళి నిరును పిలిచింది. నిరు అడుగు వేసేసరికి యామినీబాబు అన్నాడు - "ఇప్పుడు వెళ్ళనక్కరలేదు. మనం తొందరగా యింటికి వెళ్ళాలి. నాకు చాల అర్జెంటు పనుంది".

"ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ నిరు కమలతో ప్రక్కగా వెళ్ళిపోయింది. కొంత దూరం వెళ్ళి ఆగి "నిరు!" అంది కమల. నిరు మాట్లాడక నిలబడింది. "ఇదివరలో నిన్నొకసారి అడిగాను. కాని ఆనాడు నువ్వు చెప్పలేదు. నువ్వే యిదివరకే నిర్ణయం చేసుకున్నావు. మోసం... అదేమిటో తెల్సుకోవాలని నాకు కోరికగా వుంది. నీ రహస్యం నేను తెల్సుకోవడంలో తప్పేమీ లేదు.' అయినా - ఆనాడు నువ్వేమీ చెప్పలేదు. అంతా అతి రహస్యంగా దాచి పెట్టావు. నిన్ను నువ్వే నాశనం చేసుకుంటున్నావు. నేనది చూడలేను..."

నిరు కంపించింది. ఆఖరికి బాధతో అంది - "నువ్వు చెప్పేదేమిటో నాకర్థం కావటంలేదు కమలా."

"నీకెంతైతే తెల్సునో అంతా చెప్పమని నేనడుగుతున్నాను. ఆనాడే నువ్వు నిజం చెప్పినట్లైతే యీ నాటకమంతా వుండేది కాదు."

తన దుర్బలత్వం వల్లనే ఆనాడు నిజం చెప్పలేకపోయింది. అయినా తాను చెప్పకుండానే నిజం బైటపడింది. తానిక దాచిమాత్రం ప్రయోజనమేమిటి? పేలవమైన కళ్ళతో చూస్తూ "స్వయంగా నేనే నా రోగానికి మందుకోసం బయల్దేరాను. నువ్వే దారిలో అడ్డుపడ్డావు..." అంది.

"నేనా? ఎలాగ?" అంది కమల ఆశ్చర్యంగా. నిరు ధైర్యంగా అడిగేసింది - "నువ్వు కుమార్ బాబుని ప్రేమిస్తున్నావా?"

కమల ఆశ్చర్యానికి మేరలేదు. అయినా ఆ విషయం ఇదివరకే తాను అనుమానించింది. తన అనుమానమే నిజమైంది. ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. ఒక్కక్షణం నిరు కళ్లల్లోకి చూచి

అంది — "ప్రేమిస్తున్నాను. అయితే నాకొక అనుమానం వచ్చింది. ఇప్పటి నీ ప్రశ్నకు - నీ అనుమానానికి కారణం మా యిద్దరి కలయికవల్ల ఊహిస్తున్నావా? లేక యితనితో వివాహానికి ముందైనా నీకు తెల్సున్న సంబంధముందా?"

దిగులుతో నిరు ముఖం వాడిపోయింది. "నువ్వూ కుమార్‌బాబు కలిసిరావటం చూచి నేనూహించాను. అందువల్ల నా బాధను నేనే మందు తీసుకోదల్చుకున్నాను. నీకు ప్రతిబంధకంగా కావాలని నేను కోరడంలేదు. నేనెప్పుడూ నీకు అడ్డురాను. లేకపోతే కుమార్‌బాబు తల్లి స్వభావం నాకు తెల్సు. ఆవిడ తప్పకుండా నాకు ఆశ్రయమిస్తుంది. నేను తెల్సుండే విషం త్రాగాను... అయినా యిదంతా పట్టిభ్రమ..."

"ఇప్పుడైనా వాళ్లు నీకు ఆశ్రయమిస్తారు... కాదు కాదు... నువ్వే స్వయంగా ఆశ్రయస్థలాన్ని వెతుక్కున్నావు... నువ్వు హృదయంలో కూడ మోసపోలేదు... ఈ మనిషితో యిక్కడకు రావటం ఊరికేనే..."

"ఏమిటో..."

"ఏమీ లేదు కాని... తర్వాత చెప్తాలే. నీ వివాహం నిశ్చయమైందా?"

'ఆ' అంటూ కంపిత కంఠంతో ముహూర్తం తిథి చెప్పింది.

"అయితే కాన్పూరులోనేనా పెళ్లి?"

"అవును."

"యెప్పుడు ప్రయాణం?"

"రేపు ప్రొద్దుట."

"బాగానే వుందిగాని యిప్పుడు చెప్పు నువ్వు కుమార్‌బాబును ప్రేమిస్తున్నావా లేదా?"

నిరు సిగ్గుతో తల వంచుకుని మాట్లాడలేదు. కమల మళ్లీ అడిగింది. "అవును" అంది చిరునవ్వుతో.

"ఓహోహో! ఇదా నీ ప్రేమ..." అంటూ కమల నవ్వింది.

నిరు యెంతవరకు రాకపోవడం చూచి యామినీబాబు "పోదాంరా. ఆలస్యమౌతోంది" అన్నాడు బెంగాలీ భాషలో. ఆ మాటకు నిరుపమకు కూడ వినుగొచ్చి "వీణ్ణి పొమ్మని చెప్పినా యేమిటి?" అంది కమలతో.

"అప్పుడేనా? ఈ సంతోషాన్ని యిలా కొంత కాలం అనుభవించనియ్యి మరి రెండు రోజులు. ఈ నాటకం పూర్తయ్యేవరకు అతడు అలాగే వుండాలి" అంది కమల.

"అంటే?"

"అదంతా తర్వాత చెప్తానుగా. నువ్వు మాత్రం నిశ్చింతగా వుండు. అతనికి ఆనందాన్ని కలిగించు. ఏ విధంగానూ అనుమానాలకు తావియ్యకూడదు సుమా!"

'సరే' అంటూ నిరు వెళ్ళిపోయింది. కమల నవ్వుతూ కుమార్‌బాబు దగ్గరికి వచ్చింది.

## 24

అక్కగారికోసం నీలి యెదురుచూస్తూ కూర్చుంది. కారు వచ్చేశబ్దం విని గుమ్మంలోకి వచ్చి, యామినీబాబుతో వున్న నిరును చూచి మండిపడింది. నిరు కారు దిగి యామినీబాబుతో యేమీ మాట్లాడకుండా రుసరుసమంటూ మేడమెట్లు యెక్కేసి తన గదిలోకి వెళ్ళిపోయింది. యామినీబాబు అదిచూచి నిర్వీర్యుడై అలాగే కారుదగ్గర నిలబడిపోయాడు. నిరు బట్టలు మార్చుకుండానే కూర్చుని ఆలోచించడం మొదలు పెట్టింది. తన యింట్లోవారే - 'నా' అనుకున్న వాళ్లే - తనను మోసగించారే! ఎంత స్వార్థం! ఇదంతా ఆలోచిస్తుంటే ఆమెకు ఒళ్లు మండిపోతోంది. నీలి గదిలోకి వచ్చి నెమ్మదిగా చెప్పింది. "అక్కా! కుమార్‌బాబు తల్లి నీతో ఒక విషయం చెప్పమంది. మీ అక్క వ్రాసిన ఉత్తరం అందింది. కాని మీ అక్క యెంతవరకు నన్ను కలుసుకోలేదో అంతవరకు ఆ కన్నీటిని గ్రహించలేను అని చెప్పమంది. ఈ మాట యెవ్వరితోను చెప్పవద్దంది."

నిరు ఆప్యాయంగా చెల్లెల్ని చూసి "అయితే యిప్పుడే వెడదాం. లేకపోతే యీ రాత్రి ఆవిడ అన్నంకూడా తినదు" అంది.

నీలి సంతోషంతో యెగిరిపడి "యెవరైనా అడుగుతే యేమని చెప్పేది?" అంది.

"ఏదో కొనుక్కుందుకు అమీనాబాద్ వెళ్లామని చెప్పు" అంటూ కట్టుకున్న చీరవైపు ఒకసారి చూచుకుంది. అసహ్యంతో "ఛా. యీ గుడ్డలు యామినీబాబుకు తగిలాయి. వీటితో కుమార్‌బాబు యింటికి వెళ్లకూడదు." అనుకొని బట్టలు మార్చి దేముడి ఫోటోకు నమస్కరించింది. ఆమెలో అపూర్వమైన సాహసం వచ్చింది. ఇప్పుడు ప్రపంచంలో యెవ్వరి భయము లేదు. మొదట్లో భయపడిన తన రూపం కళ్లెదురుగా కన్పిస్తుంటే ఆమెకు నవ్వొచ్చింది. ఆ భయం వుండటంవల్లనే తానొక యంత్రంలా తయారైంది అనుకుంటూ ఆలోచిస్తుంటే దాసీ వచ్చింది. ఈ రోజు నిరు అంత సంతోషంగా వుండటం దాసీదానికి కూడ అనుమానమొచ్చింది. యామినీబాబుతో కారు వెళ్లబట్టేమో అనుకుంది.

(సశేషము)

# ఆత్మానందమునకు మార్గములు

మూలం: శ్రీ స్వామి కేశవయ్యజీ

అనుసరణ: శ్రీ సి. సి. పున్నయ్య

ప్రతి మానవుడు ఆత్మానందమునకు మార్గముల నన్వేషించుటవలన యిహపరములలో సుఖపడగలడు. భగవంతుని కరుణాకటాక్షముల నపేక్షించుటతో బాటు యితరులు తనకు చేసిన అపకారమును గురించికాని, ద్రోహమును గురించికాని ఆవేదనకు ఉద్రేకమునకు గురికాకుండుట ఆత్మానందసిద్ధికొక మార్గము. మీకు కలిగిన అపకారమునకు, ద్రోహమునకు యితరులు సాధనగా మాత్రమే ఉపయోగపడిరి. ఇతరులా పాత్రను అజ్ఞానమువల్ల, పొరబాటువల్ల నిర్వహించిరి. నీవు యితరుల కపకారముచేసి బాధ కలిగించుట వలన నీవు సయితము ఆ బాధకు గురికాగలవు. తెలిసియుండి కూడ నీకు నీవు బాధను కలిగించుకొనుట ము[illegible]్మటికి విజ్ఞతకాదు.

ఇతరులు తాముచేసిన పొరబాటును గుర్తించి సన్మార్గము నవలంభించుటకు నీ సానుభూతి, క్షమాదృష్టి, సద్భావము, ఉదారహృదయము తోడ్పడగలవు. తత్ఫలితముగా వారికి నీపట్ల గౌరవాభిమానములు, విశ్వాసము కలుగును. దానివల్ల వారి హృదయము పరిశుద్ధమగును. ఇది తప్పనిసరిగా ఏర్పడగల పరిణామము. అట్టిది ఏర్పడకపోయినను నీకు కలుగు నష్టము ఏమియుండదు. నీ ప్రేమపూరితమైన హృదయము, ఆదర్శనీయమైన వ్యక్తిత్వము, నడవడి నీ మనస్సును ప్రశాంతముగాను, నిర్మలముగాను ఒప్పించును.

నీ కపకారము చేసిరని యితరులపై పగపూనకుము! పగపూనుట వలన నీలో అఘాయిత్యము, క్రౌర్యము, విచక్షణాజ్ఞానలేమి యిత్యాది వికృత స్వభావములు ఉద్భవించును. ఎదుటివారి హృదయములు సంక్షోభము చెందును. ఇంతకు ముందెన్నడు నిన్ను ద్వేషించనివారు సయితము నీ విరోధభావము, ప్రవర్తనల కనుగుణ్యముగా నిన్ను ద్వేషింతురు. దానివలన మీ యిరువురి హృదయములలో పరస్పర ద్వేషము కారుచిచ్చై ప్రబలగా పరిణామాలు అత్యంత విషమంగాను, వికృతంగాను, భయంకరంగాను ఏర్పడి మీరిరువురు పాపులై భగవదనుగ్రహమునకు దూరమైపోగలరు. కాబట్టి యితరులవల్ల కలిగిన అపకారమును, అపచారమును విస్మరించి క్షమించుట ఉభయులకు శ్రేయస్కరమే కాక ఆత్మ పరమాత్మలకు సమ్మతము కాగలదు.

మానవులు నిరంతరము తమ కమరిన సదవకాశములకు కృతజ్ఞులుగా నుండవలెను. భగవంతుడు కృతజ్ఞులను ఎల్లప్పుడు అనుగ్రహించుచుండును. విశ్వాసఘాతకు లెల్లప్పుడు పరమాత్మ యొక్క ఆగ్రహమునకు గురియగుచుందురు. మీ కుపకారముచేసి సహాయ

పడినవారిపట్ల కృతజ్ఞులుగా నుండుడు! మీకు అమరిన సదవకాశములను ఆత్మపరమాత్మలకు సమ్మతముగా వినియోగించుకొనుడు!

పురోభివృద్ధికి ఆత్మపరిశీలన విశేషముగా తోడ్పడగలదు. గతములోని మన పొరపాట్లను మనము పరిశీలించుకొని, హృదయ దౌర్బల్యమును గుర్తించుటవలన ఎంతటి కల్మషమైనదో తెలియగలదు. దానివలన యితరుల దోషముల నెన్నుట కాని, వ్యర్థవిమర్శలు చేయుటకాని పరిమితము కాగలదు.

మన జీవితపరిమాణము చాల కొద్దియని ప్రతియొక్కరు గుర్తించతగినది. జీవించి యున్నంతకాలము స్నేహపాత్రులుగాను, సద్భావములోను మెలగుడు! అందరితో మంచిగానుండి మీ మాటలు, చేతలు అమృతము ఒలకబోయునవిగా నుండనిండు! అట్టి అమృతములో ఒక్క విషబిందువునైనను పడనీయకుడు! ప్రేమపూరితమైన మీ నడవడి అమృతతుల్యము ద్వేషపూరితమైన మీ నడవడి విషతుల్యము. ఉత్తమ, అధమ విభేదములు ప్రాపంచిక సంబంధ బాంధవ్యములలోనే కాని ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మ, పరమాత్మల దృష్టిలో యిట్టి భేదముల కవకాశమే లేదు.

పరమాత్మ శాశ్వతంగా మనతో నుండును. మనతో పరమాత్మ యునికి స్మృతి మనయందలి పాపపు చింతలను, భయమును పారద్రోలి ఆత్మబలమును, విశ్వాసమును ప్రోత్సహించుటకు తోడ్పడుచుండును. ప్రతియొక్కరిని భగవంతుడు వెన్నంటియుండుననునది సత్యము.

సత్యమును మనము వాగ్వాదము, తర్కమువలన గుర్తించలేము. దానిని చిత్తశుద్ధి, నిజాయితీ, సద్భావము, సేవా తత్పరతవలన సత్యమును గ్రహించగలము.

ఇతరుల తప్పులెన్నుటకలవాటు పడినచో కొంతకాలమునకు దివ్యపురుషుల, పవిత్రాత్మల నడవడిలో సయితము తప్పులెన్న మనము సాహసింతుము. అది యితరులను విశేషముగా బాధించుటయే కాక మనము సయితము బాధపడవలసి వచ్చును. దానికంటె యితరులలోని మంచిని మాత్రము గుర్తించుచు జీవితమును మాపొందించుకొనినచో మనము దివ్యపురుషుల మగుదుము. మనకు మనశ్శాంతి ఏర్పడును. ఇతరులలోని మంచినే గుర్తించుటవలన నీవెంత ఆనందము చెందగలవో పారచూడుము!

సజ్జనసాంగత్యము మన కర్మేంద్రియముల స్వాధీనము నందుంచుకొనుటకు తోడ్పడును. దీనివలన మనస్సు పరిశుద్ధమగును. కాబట్టి దుర్జనసాంగత్యమును వీడి సత్పురుషులతోటి సాంగత్య మలవరచుకొనుము!

మానవ జీవయాత్ర ప్రధానాదర్శము భగవంతుని ప్రేమకు పాత్రులగుట యనునది మరువకుడు! ఆ ప్రేమ భగవదనుగ్రహము వలన లభించునదే కాని నీవు శ్రమపడిన ఫలితముగా కాదు. నిభక్తి విశ్వాసములను అతిశయోక్తిగా నెంచక భగవన్నామ జప, స్మరణాది సాధనలను నిష్కామికగా అనుసరించి ఆత్మార్పణము చేసిననే భగవత్సా

సాక్షాత్కారము, అనుగ్రహ కటాక్షములు లభ్యముకాగలవు. భగవంతునిపట్ల విశ్వాసమే నిజమైన భక్తునికి బలము. సంపూర్ణముగా భగవంతున కంకితమైపోయి భక్తులు నిరంతరము భగవన్నామమును స్మరించుచు జీవయాత్రసాగింతురు. ఎన్నడుభగవంతుని పట్ల విశ్వాసమును వీడకుము! భగవంతుని పట్ల విశ్వాసమును కోల్పోవుటమహాపచారము – ఆత్మవిధ్వంసకముకూడాను

భగవన్నామము రక్తి ముక్తిదాయకము. ఋషులు, పుణ్యపురుషులు భగవన్నామముయొక్క అమూల్యమైన విలువను గురించి వివరించిన ప్రతివాక్యమును జ్ఞాపకముంచుకొనుము! ఆ నామమును భక్తి విశ్వాసములతో జపించి, స్మరించి అది నీ జన్మసాఫల్యమునకు తోడ్పడగలదో లేదో పరిశోధన చేయుము!

మనం జీవయాత్రలో గతాన్ని గురించి విచారపడుటవలన ఫలితము శూన్యము కాగలదు. భవిష్యత్తులోనైనా మెరుగైన జీవయాత్రకుపక్రమించి, జీవిత శేషమును భగవత్సేవకు వినియోగించుట ఎట్లా యని పరిశీలించి ముందడుగు వేయుము!

(సశేషము)



ఉత్తర ప్రదేష్‌లోని కస్తూర్బా ట్రస్టు గ్రామసేవిక శిక్షణాకేంద్రంలో వృత్తివిద్యాశిక్షణ అధ్యాపకురాలు విద్యార్థినికి శిక్షణగరపుచున్న దృశ్యము.

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ



## రచయితను గురించి

"త్రాగుబోతు" ఈ మధ్య జర్మను సాహిత్యంలో వెలువడ్డ రచనలలో బృహత్తరమైన కథా శిల్పమని అనవచ్చు. ఈ "త్రాగుబోతు" కథా శిల్పాన్ని సృష్టించిన హాన్స్ ఫల్లాడా (Hans Fallada) జర్మను ప్రజా జీవితాన్ని, ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాలదైనందిన జీవితాన్ని రక్తికట్టేలా చిత్రించటంలో సిద్ధహస్తుడు. థామస్ మాన్ తరువాత ఫల్లాడే ఇలాటి రచనలలో అగ్రతాంబూలం పుచ్చుకున్న వాడని చెప్పినా తప్పేం వుండదు. ఫల్లాడా మధ్యతరగతి కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. అలాటి కుటుంబాలవారికి మల్లె ఫల్లాడాకూడా ఎన్నెన్నో కష్టనిష్ఠూరాలను ఎదుర్కోవాలసివచ్చింది. అంచేత ఆయన రచించిన కథలు, నవలలు, నాటకాలు ఈ లోకపు జీవితాన్నే మనకు కళ్లకు కట్టినట్లు చూపెడుతూ వుంటాయని చెప్పటంలో ఎలాటి అతిశయోక్తి వుండదు. "త్రాగుబోతు" ఆయన రచనలలో కడపటిది. మొన్నటి యైరోపాయుద్ధ వాతావరణంలో వ్రాయబడ్డది. అప్పటి ప్రజాకోటి మనోతత్త్వం ఇందలి ప్రతి అధ్యాయంలో ప్రతిబింబిస్తూ వుంటుంది. ఒక వ్యక్తి సంఘపు మర్యాదలను పాటించక పోయాడా ఇక అతను ఎదుర్కోవలసిన సమస్యలకు అంతుపంతూ అనేదేవుండదు. వాటిని తేల్చుకోలేక ఆ వ్యక్తి వుక్కిరిబిక్కిరై పోతాడు. అంతేనా? పెడదోవలకు వెళ్లటానికికూడా వెనుదీయడు. అతను ఇలాటిమానసిక వాతావరణంలో అనుసరించే పద్ధతులు సంఘానికి నచ్చక పోయాయా, ఇక అతను పడాలసినయాతన ఇంతింతని చెప్పాలా?

"త్రాగుబోతు" కథలో మనతో పరిచయం చేసుకోబోతున్న "ఎర్విన్" సొమ్మర్ ఇలాటి వాతావరణానికి చెందిన మనిషి. ఎర్విన్ పుట్టింది క్రింది తరగతి బీదకుటుంబంలో. తలిదండ్రులు అతను పసిపాపగా నున్నప్పుడే చనిపోయారు. వాళ్లను ఆశ్రయించుకుని, వీళ్లను ఆశ్రయించుకుని చదువు సంధ్యలను ఎలాగో ఒకలాగు సంపాదించుకుని ఒక చిన్న పట్టణంలో చిన్న వుద్యోగం సంపాదించుకో గలిగాడు. ఆ సమయంలోనే "మాగ్దా" అనే అమ్మాయితో పరిచయం కలిగింది. "మాగ్దా" కూడా "ఎర్విన్"కు మల్లె ఒక వ్యాపార సంస్థలో పనిచేస్తూ వుండేది. ఆర్థికంగా "మాగ్దా" కొంతవరకు కలవారి కుటుంబానికి చెందిన మనిషి. ఎర్విన్‌తో బాగా పరిచయమయ్యాక, తనకున్న ఆస్తిపాస్తులతో ఒక వ్యాపారసంస్థను ప్రారంభించి నూతన జీవితాన్ని ఆరంభించాలని మాగ్దా వుబలాటపడసాగింది. కొంచెం

మూలధనం వున్నదా, కార్యకర్తలు తెలివితేటలు గలవారయ్యారా, వారి పనిపాటలకు చేదోడు వాదోడుగా వుండటానికి ఆ రోజుల్లో బ్యాంకులు తయారుగానే వుంటాయి. పెట్టుబడిదారులుగా ఎంతోమంది ముందుకు వస్తూవుంటారు. ఈ రహస్యాన్నంతా ఒకవైపు "ఎర్విన్" ఇంకోవైపు "మాగ్దా" అప్పుడు వారు పనిచేస్తూవున్న వ్యాపారసంస్థలో క్షుణ్ణంగా అవగాహనం చేసుకున్నారు. పెళ్లి చేసుకోటమే తరువాయి, ఇద్దరూ వాళ్ల వుద్యోగాలకు రాజీనామా ఇచ్చేసి ఒక చిన్న వ్యాపార సంస్థను ఆ వూళ్లోనే ప్రారంభించారు. ఆ సంస్థ క్రమేణా పెద్ద వ్యాపార సంస్థ అయింది. ఆ వూళ్లో, చుట్టుప్రక్కల గ్రామాల్లో మంచి పలుకుబడి సంపాదించారు. స్వంత ఇల్లు కట్టుకున్నారు. ఇతర వ్యాపారస్థులకు మల్లె బ్యాంకుల్లో పెద్దపెద్ద మొత్తాలను దాచి వుంచుకో గల ఆర్థికస్తోమతను కూడా సంపాదించుకున్నారు... కాలచక్రం మనం అనుకున్న పద్ధతిని తిరుగుతుందా? వ్యాపారసంస్థ బాధ్యతనంతా భర్తమీద వుంచేసి తను ఇంటి పనులను చూసుకుంటూ వుండటానికి మాగ్దా నిశ్చయించుకున్నది... ఆమె సంస్థను వదలినప్పటినుంచి "ఎర్విన్" పనినంతా నిర్వహించలేకపోయాడు. తనకు సహాయం చేయటానికి కొంత మందిని నియమించుకున్నాడు. పనివాళ్లు అతని అమాయకత్వాన్ని గ్రహించి అతనిని మోసం చేయటానికి మొదలెట్టారు. ఇదంతా ఎర్విన్‌కు తెలుసు. ఈ సంగతి సందర్భాలు మాగ్దాకు తెలుస్తే నా? ఇంకేం వుంది!"...

"ఎర్విన్"తో మాగ్దా ప్రతిరోజూ, సాయంకాలం, అతను వ్యాపారసంస్థనుంచి ఇంటికి చేరుకున్నాక అక్కడి సంగతులు తెలుసుకోటం పరిపాటి అయిపోయింది. అక్కడ అంతా బ్రహ్మాండంగా జరిగిపోతున్నదని చెబుతూ ఆవిడను తృప్తిపరుస్తూ వుండేవాడు. కాని ఎంతకాలం రహస్యాన్ని దాచి వుంచగలుగుతాడు?...

దాంతో ఎర్విన్ మనోతత్త్వమే మారిపోయింది. తన బాధలనుంచి బయటపడటానికి తాగడం మొదలెట్టాడు. ఇంట్లో పండగలకు పర్వాలకుగాను కొన్ని ఘాటు పానీయాలను జాగ్రత్తపరచటం వాళ్లకు అలవాటు. తన బాధను మరచిపోటానికి ఎర్విన్ పెటిసి మాయం చేయటానికి మొదలెట్టాడు. ఈ సందర్భంలో అతను అవలంబించిన పద్ధతులు సామాన్యమైనవి కావు? ...

మాగ్దా క్రమేణా దీన్నంతా గ్రహించి ఎంతో విచారించింది. నయాన భయాన యీయవలసిన సలహాల నిచ్చింది. జీవితచక్రం అడ్డు తిరగటంతో ఇక ఎర్విన్ భార్య సలహాలను మన్నించే స్థితిలో లేడు... ఆవిడకు ఎదురు తిరగటానికి ప్రారంభించాడు...

వాళ్లు వున్న వూళ్లోనే పెద్ద జయిలు వుంది. జయిలుకు కావాలసిన సామాన్లను సప్లయి చేయటం వాళ్ల సంస్థ పని. మూడేండ్లకొకసారి కంట్రాక్టు చేసుకుంటూ వుండాలి. జయిలు అధికారి మంచివాడు. మాగ్దా తెలివితేటలు ఆయనకు బాగా తెలుసు. అంచేత ఇతర సంస్థలు ఎన్నో ఈ కంట్రాక్టుకోసం శతవిధాలా ప్రయత్నిస్తూవున్నా, ఈ కంపెనీ ధరలనే అంగీకరిస్తూ వుండేవాడు. కంట్రాక్టర్లు ఆయనను అడపాదడపా చూస్తూ వుండటం అవసరము. సంస్థ పనులను చూసుకుంటూ వున్నంతకాలమూ మాగ్దా ఆయనను కలుసుకుంటూ, ఆయన ఇచ్చే సలహాలను తూ.చ. తప్పకుండ నెరవేర్చటానికి ప్రయత్నిస్తూ వుండేది. ఆవిడ సంస్థకు రావడం మానేసినప్పటినుంచి ఆ పని చూసుకోటానికి ఎర్విన్‌కు వీలు చిక్కేది కాదు. దాంతో జయిలాయనకు కోపం వచ్చింది. వీళ్ల రేట్లు తనకు నచ్చాయి కాదని, వీటికన్నా తక్కువ రేట్లను సూచించిన మరో సంస్థ టెండరు అంగీకరిస్తూ వుత్తరం వ్రాశాడు వీళ్లకు. జయిలు కంట్రాక్టు పోగొట్టుకోటంతో సంస్థ పెద్ద దెబ్బ తిన్నదనే అనవచ్చు. ఈ సంగతి భార్యతో తక్షణమే చెప్పివుంటే ఆవిడ జయిలాయనను చూసి వుండేది. కంట్రాక్టును నిలుపబెట్టుకునేది .. కాని భర్తకు అంత దూరదృష్టి వుంటేగా!...

ఆరోజునతిన్నగా అటు సంస్థ కార్యాలయానికి గాని, ఇటు ఇంటికిగాని వెళ్ళక, ఎర్విన్ వూరికి కొంచెం దూరంలోనున్న కుగ్రామంలోకి వెళ్లాడు. పట్నవాసానుంచి వచ్చేవాళ్లకోసం అక్కడ మంచి హోటలు వుంది. మంచి భోజనం లభిస్తుంది. తనివి తీరా రుచిచూడటానికి కావాలసిన పానీయాలు ఎన్నెన్నో దొరుకుతాయి. పూర్వపు రోజుల్లో ఎర్విన్ మాగ్దాతో ఇక్కడికి సెలవురోజుల్లో వస్తూ కాలక్షేపంచేస్తూ వుండేవాడు ... ఇప్పుడు అతను రావటం ఒంటరిగా. వాళ్ళ రథం ఇక ఎలా కదులుతుంది? ఆ సంగతి మాగ్దాకు చెప్పితే ఎంత రాద్ధాంతమవుతుందో అతనికి తెలుసు. ఆ గొడవనుంచి తప్పుకోటానికి పానీయాలను, ఘాటుఘాటు పానీయా

(378వ–పేజీ చూడుడు)

# మతకర్తలు : తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(జూన్ సంచిక తరువాయి)



ఒక నాఁడా జోధపూరు రాచనగరున్న రాజవీథిలో నూత్నముగఁ బెండ్లాడిన దంపతులు మహోత్సవములో నూరేఁగుచుండిరి. అప్పుడు మీరా తనతాతగారిని తనవివాహముంగూర్చియుఁ దన్నువరింపఁబోవు భర్తం గూర్చియుఁ బలువిధములుగఁ బ్రశ్నించుచుఁ దొందర కలిగింపసాగెను. అంత రాణా ఆమెతో "శ్రీకృష్ణ భగవానుఁడే నిను వరింపనున్నాఁడు" అని పరిహాసమునకనెను. ఆరాకొమరిత — పితామహుని వాక్యము యథార్థమని మనఃపూర్వకముగ విశ్వసించెను. అప్పటి నుండియు నామె శ్రీకృష్ణుఁడే తనపతియని భావింపఁ జొచ్చెను.

ఒక నాఁడొక సాధువు రాజభవనమున కరుదెంచెను. అతనికడ శ్రీకృష్ణుని దివ్యసుందర రూపము ప్రతిబింబించు ప్రతిమ యుండెను. మీరా, దానిపయి మోజుపడి, యెట్లయిన దానిని గ్రహింపఁగోరెను. కాని, తన యభిలాష ఎట్లుసిద్ధించును? ఆ సాధుపుంగవుఁ డెప్పుడును దన విగ్రహము నెడఁబాసి యుండువాఁడు గాఁడు. తన మనోరథ సాఫల్యమున కాయమ యుపవసింప నారంభించెను. శ్రీకృష్ణభగవానుని బలుతెఱఁగులఁ బ్రార్థింపఁ దొడంగెను. అంత శ్రీకృష్ణదేవుఁ డాసాధువునకుఁ బ్రత్యక్షమై యాప్రతిమను మీరాబాయి కొసంగ నాజ్ఞాపించెను.

ఆ సాధువరేణ్యుఁడు మీరాతనగీతములలో గురునిగఁ గీర్తించిన రాయిదాసని నిశ్చయించుట కాధారములు మృగ్యములు. రాయిదాసుఁడను భక్తుఁడను కబీరుఁడును రామానందయోగికి శిష్యులయియుండిన సమకాలికులు. వారు జీవించిన కాలమునుబట్టి పరిశీలించుచో, వివాహమాడుటకు మున్నే రాయిదాసు మీరాను గలసికొని యుండవలెను.

మీరాబాయి భారతభూమి కత్యంతగౌరవమును గడించిన చిత్తోడు రాజ్య సింహాసనాధిపతి యగు మహారాణా సంగభూపాలుని పుత్రుఁడును, అతని యనంతరము గద్దెనెక్కఁదగు హక్కుగలవాఁడు నగు భోజరాజును జెట్టవట్టెను. అతఁడట్లామె నుద్వాహముచేసికొన్న పదేండ్లకే మరణించెను. అప్పుడు మీరా దేవాంశ సంభవ హృదయాధినాథునే సాధునిగఁ దలంచెను. ఇపుడు గిరిధరగోపాలుఁడే ఆమె భర్త; కర్త; సముద్ధర్త. శ్రీకృష్ణగానామృత పానాతిశయ పారవశ్యమున మీరాబాయి భక్తబృందముతోను, సాధువర్గముతోను స్వేచ్ఛగ సంచరింపసాగెను. ఆమె ప్రవర్తనము పుట్టినింటికే కాక మెట్టినింటికిని అపకీర్తికరమని లోకులు భావించిరి.

భోజరాజరాణా గతింపఁగనే, అతని తమ్ముఁడగు విక్రమజితుఁడు సింహాసనమునకు వచ్చెను. మీరాబాయి యోగులతోను యతులతోను, పరివ్రాజకులతోను గలసిమెలసి తిరుగుట అతని కేమాత్ర మిష్టము గాకుండెను. కొందఱు స్త్రీల నతఁ డామె చిత్తమును ఐహికముల వంకకుఁ ద్రిప్పనియమించెను. వారట్లే — ఆయమ మనస్సు మార్పుటకు వచ్చి, ఆమె చేయు నుపదేశములు విని తామే తమ యభిప్రాయములు మార్చుకొని తిరిగి యేఁగుచుండిరి. విక్రమజితుఁడు తన తల్లి ప్రేరేపఁ, బిశాచ నివాసస్థలమగు నొక గదిలో బంధించెను. కాని, మీరా జేయు శ్రీకృష్ణసంకీర్తనము చెవినిబడఁగనే, భూతములన్నియు నటనుండి పాఱిపోయెను. ఇంకొక సందర్భమున — అమృతకుంభమని నమ్మకకలుగునట్లు, మీరాదేవికి విసముతో నిండిన యొక పిడుత నంపెను. ఆమె యా చిన్నారికడవలోని విసమును దొలుదొల్త — శ్రీకృష్ణునకు నివేదించి, తరువాత దానిని గుటగుట త్రాగివైచెను. అప్పుడామె పూజించు విగ్రహము యొక్క మోమునివన్నె - వికారముగు ఆకుపచ్చని వన్నెగ మాఱిపోయెను. తుట్టతుదకు రాణా, ఆమె వలనఁ గుటుంబమునకు సంభవించిన కష్టములతోను, అవార్యదుర్యశముతోను దలయెత్తికొననీని మీరా దుష్ప్రవర్తనమును సహింపలేక, యెట్లయిన ఆమె బాధనుండి తప్పించుకొనఁ గలఁ , నిశితకరవాలముఁగొని, చంపుటకుఁ బూనెను. ఇంటిలో గదియందు మీరా మస్తానులు పెక్కురుండుటఁగని వారిలో ఎవ్వతె తన వదినెయో, కనిపెట్టఁ జాలక పోయెను. ఆవెంబడినే, రాణాయెదుట గర్జించుచు నరసింహదేవుఁడు ప్రత్యక్షమయ్యెను. విక్రమజిత్తు

అని గాంచి భీతిచెంది ఆక్రందన మొనర్చుచుఁ బలాయనమంత్రము పఠించెను. తాను ప్రత్యక్షముగఁ జూచిన భయంకరదృశ్యములకెల్ల - ఆ గదిలోని పిశాచములే కారణములని యాతఁడు భావించెను.

తనకుఁ గలిగించిన యిట్టి అసహ్యవేదనలతో మీరారాణి విసిగిపోయి, తనకు మార్గదర్శిగ నుండ వేఁడుచు, తులసీదాసున కొకలేఖ వ్రాసెను, అతఁడును సీతారాముల నిరాకరించి, వారికి వ్యతిరేకముగఁ జరించు సన్నిహిత బంధువులనైనను, బరిత్యజించియే తీరవలెను. ఈ సందర్భమునఁ దన జనకుని ప్రహ్లాదుఁడును, దనయన్నను విభీషణుఁడును, భరతుఁడు దన మాతృదేవిని, బలిచక్రవర్తి తనగురువును, గోపికలు దమ మగలను పరిత్యజించిరి. ఆకాలమందామె యాశయము లెట్టివో, క్రింది పద్యములవలన గ్రహింపవచ్చును:-

"మత్ప్రియుని దివ్యరూపుని, మహితగుణుని,
మాని యన్యులఁ గోర, రామప్రభుండె
తగును సామ్రాజ్య కనిశము, తక్కువారు
నాదుదృష్టిని దాని కెంతయును దగరు"

"మోదమున హరిఁగొల్చు సత్పురుషులెల్ల
నరుగుదెంచి మీరాబాయి యవసథమగు
రాచనగరున నుండ్రు నిరంతరంబు,
కమలనయనుఁ గీర్తించుచు నమితభక్తి"

"అనవరత మసత్యాత్ముల కందరాని
మివుల దవ్వగు తావుల మెలఁగుఁ, గాని
సాధు సాధుల సన్నిధానమున నెపుడుఁ
బరమ కారుణ్య మూర్తియై వఱలుచుండు"

"అంత రాణాయు సాధుజనాళిఁ గలసి
యుండవలదని, తనతోడ నుండు మనియు
జాబునంప మీరాకు, నాసాధ్వి ఈవె
సింగపుంగద్దె దిగిముమ్ము జేరుమనియె"

"అవల నొకపరి రాణా విషమ్ముగలుగు
గిన్నియను మీరాకంపఁ గిమ్మనకయ
దాని నమృతంబుగా మదిఁదలఁచి యామె
ఆ జగన్నాథుఁడే యామె కంగరక్ష"

"ఓయి, యుష్ట్రపాలిర, నీయొంటె వేగ
సజ్జితమొనర్పు, పయనమై చనఁగవలయు
నూరులకొలంది మైళ్లిఁక నీరమేని
గొనుట యఘము రాణారాజ్యమున నిజమ్ము"

"అని మాయను లోఁగని వెం
టనె సర్వస్వమ్ము నక్కడనె విడిమేవార్
జనపదముఁ జేరబళ్ళిపు
మునకున్ మీరాంబ సుశ్వమును నెక్కిచనెన్"

మీరా తనరాణివాసమును రాజ్యమును ద్యజించి తండ్రి కడ కరిగి, కొంతకాల మట గడపి, అనంతర మామె బృందావనమునకు వెడలెను. అట, శ్రీ చైతన్యుని శిష్యుఁడగు రూపగోస్వామిని గలసికొన నెంచెను. అతఁడు స్త్రీలను జూడనని ప్రతిన నొనర్చినవాఁడు. కాన మీరాబాయిని జూడ మొట్టమొదట నిరాకరించెను. అది యెఱింగియామె "శ్రీ కృష్ణభగవానుఁడు తప్ప, పురుషుఁ డితరుఁ డెవ్వఁడేనియున్నఁ దెలుపవలె"నని చెప్పిపంపెను. అది యాలించి, యాతఁడు, మీరా యెవతెయో గ్రహించి, వెంటనే యామెను సందర్శించెను. ఆ నాఁటినుండి వారిరువురకుఁ బరస్పర గురుత్వ మేర్పడెను. తరువాత మీరామాత కాశికిని ద్వారకకును బోయెను. తనజీవితశేషము నచటనే కడపుచు పరమార్థ తత్వరహస్యమును స్వానుభవమున గ్రహించి, తత్సత్య శాశ్వతత్వమును గుర్తించెను.

ఇట్లుండ రాణాకు దుర్దినములు సంభవించెను. అతఁడు దిక్కులేనివాఁడై, జీవితాశ వదలుకొను దుర్దశ కగ్గమయిన సమయమున మీరాను స్మృతికిఁ దెచ్చుకొనెను. తనసన్నిహితులగు ముఖ్యులను గొందఱి ద్వారకకుఁ బంపి, వెంటనే చిత్తోడునకుఁ దీసికొని రా నాజ్ఞాపించెను. ఆమె తిరిగి వచ్చుటకు సమ్మతించునంతవఱకు నిట్టుపాసము చేయ నిశ్చయించుకొనిరి. అట్టి సమయమున నామె భగవదనుజ్ఞ నొంద దేవాలయమునకు వెడలి, భగవంతుఁడగు కృష్ణుం బ్రార్థించుచుండ గుండెలు ప్రీలి భగవత్సాయుజ్యమును బొందెను.

ఎవఁడేని భక్తశిరోమణి భగవతాదాత్మ్యము నంది, అచంచలమును శాశ్వతమును అగు అవినాభావ సంబంధమును దనకును భగవంతునికిని గలదనుసత్యమును గుర్తెఱింగి, ఆపరతత్వమునే, తనహృదయాంతర్గతమగు హృదయముగను ఆత్మగతమగు ఆత్మగను - మనసార భావించి ప్రేమించునో, అట్టి వానికి భగవంతునికంటె అన్యములు సన్నిహితములు కావు. అట్టిభక్తుఁడు తన యారాధ్యదైవమునకు సేవకుఁడు; కుమారుఁడు; తండ్రి, తల్లి; మిత్రము; కళత్రము - అయి, ఆయా వ్యక్తిత్వముల కనుగుణముగ పరబ్రహ్మమును

సేవించును. అట్టిభక్తుడు దన కాకర్షణీయముఁ; ప్రాపంచిక విషయముల నన్నిటిని - తన యిష్ట దైవమువంకకే మరల్చును. — అతని కా నిర్గుణ తత్త్వానుసంధానమే పరమలక్ష్యము.

భక్తుఁడు తనతో ఎట్టి సంబంధము కల్పించుకొని తన్నుఁగొలిచినను భగవంతుఁడు అట్టివాని ననుగ్రహించును. తులసీదాసు తన యిష్టదేవతకుఁ దాను సేవకుఁడుగ భావించి, ఆధారణిలోనే తనపద్యములను వ్రాసెను. సూర్దాసు తాను తన యారాధ్యదైవమున కాంతరంగిక మిత్రుఁడని భావించి కొలిచెను. మీరాబాయి యన్ననో, శ్రీకృష్ణుని నిరంతర మత్యంత భక్తి ప్రపత్తులతోఁ బూజింపఁ దగినవానిగా నెంచి, యాతనికిఁ దన్ను ఉత్తమ (పతివ్రతగా –) సతిగా సమర్పించికొనెను. ఆమె తాను రచించిన కీర్తనల నన్నిటిని తన ప్రభువును ప్రాణేశుఁడు నగు గోపాలస్వామి పదకమలములకుఁ దన యాత్మనే అంకిత మొనర్చికొనెను. ఆమె తన హృదయాధినాథుఁడగు ప్రభుని సంపూర్ణముగ విశ్వసించెను. ఆమె రచించిన యీ క్రింది కీర్తన మామె యచంచల భక్తి యెట్టిదో తెలుపఁగలదు:—

"మనసా, నా ప్రభుచిత్తం
బనిశర గభీర ప్రేమార్ణవగు క్షణముకైనఁ
గనఁగలవు ప్రేమ నదియై
డ్డున నద్దము త్రోల నెప్పుడుఁ మది యలరఁ ||

భగవంతుఁడును, తద్దాసులును దప్ప నామెకితరు లేరును ఆనందదాయకులుఁ గారు,

భువిని గిరిధర గోపాలమూర్తిదక్క—
బంధువుల్లేరు నాకు సద్భక్తవరులఁ
గాంచి నేను మోదమందెడు కరణి
లోకముఁ జూచి పొందుదు సర్వ శోకమకట!

(సశేషము

---

న్యూయార్కు నగరం వీధిలో గంటకు 60 మైళ్ళవేగంగా కారు నడుపుతున్నది ఒక యువతి. సార్జంటు కారు నాపి అంత వేగంగా పోతున్నందుకు ఎందుకు శిక్షించ కూడదో సంజాయషీకోరాడు. ఆమె "నా కారు టైర్లు చాలా అరిగి పోయియున్నవి. నేను అవి బ్రద్దలైపోయే లోపల యింటికి వెళ్ళాలనుకున్నాను" అన్నది. 'సిసి'






# సిరిసిరిమువ్వలు

''బాబూ! యీ గ్రామంలో ఏమిటీ కోలాహలం, ఉత్సవాలు యీ రోజున?'' అన్నాడు అప్పుడేవచ్చిన వ్యక్తి గ్రామస్తునితో

''అదా - మేమీరోజున సుప్రసిద్ధ దేశభక్తురాలి జన్మదినోత్సవం జరుపుకొంటున్నాము. ఆమెకీనాడు నూట ఒక్క సంవత్సరాలు నిండినవి''

''అయితే ఆమె ప్రక్కనే నడుస్తున్న సన్నగా, పొడుగ్గానున్న వ్యక్తి విచారవదనంతో కాళ్ళీడ్చుకుంటూ పోతున్నాడేమిటి?''

''ఆయన ఆమె అల్లుడు. అయనే ముప్ఫై సంవత్సరాల నుండి ఆమె జీవితభీమాకు ప్రీమియంములు చెల్లిస్తున్నాడు''

♦ ♦ ♦

ఒక డాక్టరు తను చికిత్సచేస్తున్న రోగికి అతని యదార్థ ఆరోగ్యస్థితిని తెలియజేయ నిశ్చయించుకుని దగ్గరకు వెళ్ళి ''నీ వ్యాధి పరిస్థితి చాలవిషమంగా నున్నదని తెలియజేయక తప్పిందికాదు. నీకు ఎవరినైనా చూడవలెననియున్నదా?'' అని అడిగాడు.

''అవును'' అన్నాడు రోగి నీరసంగా

''ఎవరు వారు?''

రోగి కొంచము గట్టిగా ''మరొకమంచి డాక్టరును'' అన్నాడు.

♦ ♦ ♦

ఒక ఆఫీసు మేనేజరు లేడీ టైపిస్టుతో ''నీవు ముస్తాబగుటకు చాలకాలం వ్యర్థం చేస్తున్నావు'' అన్నాడు.

''ముమ్మాటికి వ్యర్థంకాదు. నేను ఉద్యోగంలో చేరి ఆరుమాసములు మాత్రమే అయింది. అప్పుడే కంపెనీ జూనియర్ భాగస్తుని ప్రేమానురాగాలకు పాత్రురాలనై ఆయనను వివాహమాడబోతున్నాను.''

♦ ♦ ♦

''ఏమండీ! మన శివరాం తనపన్యాలు హోమ్‌వర్కంతా తనస్నేహితుల చేత చేయించుకుంటూ సోమరిగా తయారగుతున్నాడు'' అన్నది ఒకామె తనభర్తతో

''ఛా! సోమరితనం ఎలాఅగుతుందది! నిర్వహణాసామర్థ్యమంటారు దానిని''

♦ ♦ ♦

''మరే! నీవు పెండ్లాడాలని కుతూహలపడుతున్నట్లు కనుపిస్తున్నావు'' అన్నది స్నేహితురాలు మేరీ.

''అవును రాజ్యం!''

''నీ కోసరమని వేళపాళ లేకుండా అప్పుడప్పుడు వస్తుంటాడే అతనిని కాదుగదా నీవు వివాహమాడబోయేది!''

''అతనినే''

''అతనితో నీకు పరిచయం కుదిరింది బహుకొద్దికాలం క్రిందటే ననుకుంటాను; మరి అతను ఎలాటివాడో ఏమిటో! ఎందుకైనా మంచిది-త్వరపడవద్దంటున్నాను.''

''అతనేమి నాకు క్రొత్తవాడుగా కనుపించడంలేదు.

అతనితో ఎంతో కాలంనుండి పరిచయమున్న పిల్ల నాకు అతనిని సిఫారసుచేసింది'' అన్నది మేరీ.

'సిరి'



# “మార్గదర్శి”

శ్రీ సన్నాకుల సుందరరావు B. Com.

సుధ, నిరాశా నిస్పృహాలతో కాంతివిహీనమైన నేత్రాలను గోడ గడియారం మీదికి పోనిచ్చింది. బూజు పట్టిన గడియారం! సందె వెలుగుల్లో అంకెలు స్పష్టంగా కనిపించలేదు. బాధతో, రోడ్డుపైనున్న దీపస్తంభాన్ని దృష్టించాయి ఆమె నేత్రాలు

వీధి అంతా నిశ్శబ్దమయం. పట్నవాసులు కడగా వుంచినట్లు, వీధిలో రోడ్డుకూడా, సుగమ్యంగా లేదు. పేరుకు పట్నం-అందానికి అంతరాయం!! అందాలు ఆడంబరాలు, రోడ్లూ తీర్చి దిద్దటాలూ దేనిలో వున్నయ్? అవి నివసించేది వాటి అందాలు తిలకించి ఆనందించేది, ధనరాసులు. ఔను – కళ బీదవాడి వద్దవుంటే రాణింపు ఏదీ? కళకు తగ్గట్లు మెరుగు లేకపోతే ఆ కళ ఏమౌతుంది?? వున్నటువంటి సంస్కారాన్ని – సౌభాగ్యాన్ని అనుభవించటం చేతకాని వారికి వాటివల్ల లభించేదేమిటి? సుఖం నాస్తి! సంపద నిర్వీర్యం..

సుధ, ఓసారి తన జీవితపు కారు మబ్బుల్లోకి తొంగి చూసింది. లోకానికి వెలుగిచ్చి సకలజాతులకూ ఇంత పెట్టి పోషకారకుడైన, సూర్యునికూడా, వెలుగును మధ్యపరుస్తూ, కారు మబ్బులు బంధిస్తూనే వుంటయ్. కాని లోకసంచారకుని క్షణమాత్రమే ఆవరించగలవు. ఎల్లకాలమూ అడ్డు పెట్టలేవు. ఆయన, మరి అజేయుడు. ఆయనకు వచ్చే ఆటంకాలన్నీ జ్వాలలతో హరించి వేయగలడు. కాని వ్యక్తిత్వంలో వచ్చే ఆటంకాలు జయించటానికి కావల్సిందేమిటి? అది ఒక్కటే ఒక్కటి-దాని పేరుచెప్పితే శుష్కించిన అస్థిపంజరాలు గూడు కట్టుకొని పోయిన అవయవాలు లేచి నిల్చుంటయ్; బలప్రధానంతో నిండిన శరీరాలు ప్రస్ఫుటంగా నవ్వుతాయి. నీతి నిజాయితీలు లెక్కచేయక ఆత్రుతతో హస్తాలు ముకుళిస్తాయ్. అది రహస్యప్రధానం. మానవ లక్ష్య సాధ్యం. కష్టాలకు భూతదండమ్. అపరమ వస్తువు! ఆవబ్రాయుధం!! ఒక్క మాటలో చెప్పితే_ధనం!!!...

ఆ ధనాన్ని అనుసరించే సామెతలు ఉద్భవించినయ్. ధనంలేని సాహిత్యం, కళ, నిర్జీవమై పోయాయ్. రెండూ, సజీవమైనవే, కాని వాటి నివాసస్థలాలను బట్టీ విలువలు మారటం సమంజసమై పోయింది.

♦ ♦ ♦

సుధకు, జీవితంలో నా అనే వారంటూ లేరు. ప్రపంచంలో తనకు ఆప్తులెవ్వరా అంటే తనూ - తన శరీరం. పొట్టపోసుకోవటానికి తను పడుతున్న బాధలు చూస్తూ వుంటే ఒక్కోసారి జీవితం మీద విరక్తి పుడుతూ యుండేది.

కష్టాల పరంపరలో సుధకు వ్యక్తికుండవలసిన ఓర్పంతా హరించి పోయింది.

విశాల ప్రపంచం. లక్షలాది ప్రజల నివాసం. గ్రామాలలో వేలు, పట్టణాలలో లక్షలు; నివాస యోగ్యం. ఆ లక్షల్లో – సుష్టుగా భోంచేసి శరీరాన్ని దాచుకోవటానికింత గుడ్డముక్క గలవారు లెక్కకొస్తే తక్కువే. అటువంటి సమాజంలో బ్రతికేం? ఆ బ్రతుకువల్ల లాభమేమిటి?? అసలీ మానవ జన్మ రహస్యమేమిటి?

న్యాయానికొస్తే సృష్టికర్త; దయా స్వరూపుడనీ ఆపద్బాంధవుడనీ. ఆశ్రిత రక్షకుడనీ, నిష్పక్షపాత స్వభావుడనీ, వేదాలు, శ్రోత్రియలూ, భక్తులు వర్ణించి వల్లిస్తారు. ఈ పేదరికం, నికృష్టజీవుల ఆకలిబాధలు సర్వేశ్వరుడు ఎలా చూస్తూయున్నాడు? ఔను; ధనికుడు పుట్టేదీ రెండు కాళ్లు రెండు చేతులు, రెండు కళ్లతోనే పుడ్తాడు. పేదవాడు పుట్టే విధానం

చూసినా అంతే. మరి కష్టసుఖాల తారతమ్యాలు ఏర్పడిందెలా??

న్యాయానికి శాస్త్రప్రకారం స్త్రీ పురుషులకు అన్నిరంగాలలో సమాన స్వతంత్రం వుంది. అయితే, స్త్రీ తన బ్రతుకు తెరువు చూసికోటానికి బయలుదేరినపుడు ఆమెకు ఆశ్రయమిచ్చే వారు లేనేలేరు. ఆడది అంటే ఓ నీచమైన వస్తువా? సమాజం దృష్టిలో విలువలేనిదా? ధనిక కుటుంబాలలో పుట్టిన అబల సబలే. ఎందుచేతంటే ఆమెకు తన స్వయంపోషణకై పడిగాపులు పడే అవసరం లేదు. మరో వైపు ఆర్థిక స్తోమతు లేని కుటుంబంలో పుట్టిన అబల అబలే. ఆ – అబల, సబల కావాలంటే సంఘాన్ని నడిపే తాంత్రికుల చేతుల్లో లొంగిపోవాల్సిందే. అలా లొంగనేరని పరిస్థితుల్లో ఆమె జయాన్ని ఎంతమాత్రం, సాధించలేదు

♦ ♦ ♦

సుధ, అటువంటి నూటి పోటులెన్నో రుచి చూసింది. ప్రాధేయపడే చోట తన అభిమానాన్ని కాలదన్నింది. తలవంచేచోట తలవంచే నూట్లాడింది.

తలిదండ్రులు పోయాక ఉద్యోగం కోసం ఎక్కే మెట్లు ఎక్కింది; దిగే మెట్లు దిగింది. అయితే స్త్రీ గౌరవంగా బ్రతకటానికి లభించే ఉద్యోగాలేవీ ఆమెకు లభించలేదు అది ఆమె అసమర్థతా కాదు. విద్యా విహీనతా కాదు. తప్పు సుధది, కానే కాదు; అదంతా సమాజం తీరు. ఆర్థిక స్తోమతు లేని గృహంలో జన్మించే నారిగతే ఇది. క్రిందవుండే వాడ్ని అధః పాతాళానికి అణగద్రొక్కటం సమాజం యొక్క ముఖ్యలక్ష్యం. ఆ లక్ష్యాన్ని ఎదుర్కొనే శాస్త్రవేత్తలు విజ్ఞాన స్వరూపులు లేనేలేరు. విజ్ఞానం ఎంత వరకూ రూపొందిందంటే, అది బలహీనుల్ని బలహీనులుగా చేయటానికే; మారణాయుధాలతో జనాన్ని మట్టుపెట్టడానికే.

♦ ♦ ♦

సుధ, నిలువుటద్దం ముందు కూర్చుని తన యౌవనాన్ని ఓ సారి పరీక్షించుకుంది. సౌందర్యం విషయానికొస్తే సుధను ప్రత్యేకించి చూపనవసరం లేదు. తీర్చిదిద్దిన కనుబొమలు, గుండ్రని నేత్రాలు, నవీన భావాలు వెదజల్లే ముఖారవిందం, భారీ విగ్రహం, ఎత్తుకు తగ్గ శరీర సౌష్టవం. సమస్త అర్హతలూ, నవీన భావాలు తనలోవున్నయ్. అవి వున్న స్త్రీకి అనువైన ఉద్యోగం ఉదరపోషణకు "అఘాయిత్యం" అనే తెర మాత్రమే. ఆ తెర చాటున ఉన్నంతసేపూ స్త్రీకి పొగడ్తలు సుఖాలు, సంపదలు. ఆ తెరవిడచి ఇవతలి ప్రపంచంలో అడుగు పెడితే ఎత్తిపొడుపులూ, సాధింపులూను.

ఉదర రక్షణకు అన్వేషించిన ఉద్యోగాలన్నిటికీ, సుధ, అనర్హురాలుగా నిర్ణయమై పోయింది. ఉద్యోగాన్వేషణకు వెళ్ళిన చోటల్లా, సుధను, సౌందర్యారాధన – శీల సమర్పణ, అడకువను అంగీకరించటమే ప్రధానార్హతగా నిర్ణయించింది సమాజం. అంతే అంతటితో ఆమెకు జీవితంపై విరక్తి పుట్టింది ఆత్మహత్య చేసుకుందామనుకుంది. కాని ధైర్యం చాలలేదు. తనలో నివసిస్తున్న ఉదర జ్వాలలే ఆమెను లొంగదీసి గెలచినయ్ అంతే; ఆ క్షణ నుండే సుధ జీవితం మారిపోయింది. ఆమె ఆశయాలు జీర్ణించాయి. ఆమెలో అంకురించివున్న దైవచింత పూర్తిగా తొలగిపోయినది. సమాజ శృంఖలాలకు ప్రణమిల్లింది. క్షుద్బాధ ఉపశమించటానికి, వన్నెలు తెచ్చి తీర్చిదిద్దిన తన అవయవ సౌష్టవాన్ని – సమాజానికి బలిపెట్టింది. విశాల భావాలు వెదజల్లే ఆమె అభిమానం ఒక్కుమ్మడిగా ఆమెను, వారంగనగా మార్చేశాయి.

♦ ♦ ♦

ఈనాడు సుధ అంటే ... సమాజం కన్నుమంటుంది. తోటి స్త్రీలోకం ఆమెను దుమ్మెత్తిపోస్తుంది. తమ సంసారాలు నాశనమయినందుకు కారణయోగ్యం ఫలాని ... సుధ, అని చెప్పే కంఠాలు వేలకొద్దీ వున్నయ్. సమాజ వినాశనానికి కారణం తనేనని పత్రికలెన్నో ప్రచారం చేశాయి,

సుధ తప్పు దీనిలో ఎంతవరకువుంది! ఏ సంస్కర్త ముందుకొచ్చి సుధ చేసిన అపరాధాన్ని రుజువుపరచగలడు?? దానికి సమాధానం యిదే. అపరాధాన్ని చూపించే మునివ్రేలు నీ అంతరాత్మకు ఎదురుగా తిప్పుకో. గద్దించేనీవు, భగవత్సాక్షికి చెప్పే జవాబేమిటి?

అందరి దారి వేరు. సుధ దారి వేరు. పరిస్థితుల ప్రభావం ఆమెను గెలిచింది. గాని ఆమెకు అభిమానం లేకపోలేదు. అంతరాత్మ విమర్శ లేకపోలేదు. వేశ్యవృత్తినుండి తన పంథా మార్చుకోవాలని అను

...ంది. విడచి బ్రతికేదెలా ? తన్ను చేరదీసేదెవరు ? ఏవ్యక్తి తనను స్వీకరించి దానివల్ల సమాజం కురిపించే నిందలను సహించగలడు ?

తనకు ఇష్టం వున్నా లేకపోయినా వచ్చే విటులకు దాసోహం అంటూ ముళ్లమీది జీవితాన్ని కౌగలించు కుంటూ; ఆ నికృష్టాన్ని క్షుద్బాధకు, ఆనందంగా ఇముడ్చుకొంది సుధ.

ఒక వైపు తను అనుసరించిన వృత్తిని తలుచుకున్న ప్పుడు దానిని అనుసరించే విమర్శలూ; సమాజం వేసే నిందలు; జ్ఞప్తికివచ్చి సుధ దుఃఖించేది. తోటిస్త్రీలు పొందే ఆనందానికి అంతరాయం తనే నంటూ అందరూ వేలెత్తి చూపుతారు. వేశ్యా సాంగత్యం కోరే పెద్ద మనుష్యులూ, సమయం వస్తే ఆమెనే నిందిస్తారు.

ఆఖరుకు ఆ భగవంతుని దర్శించే హక్కు కూడా తనకులేదు. పరిస్థితుల పాపపంకిలాన్ని శుద్ధి చేసికో వటానికి ప్రయత్నించినా సమాజం అందుకు అంగీక రించదు. తను కనబడితే వ్యక్తులు గుసగుసలాడు తారు. చీకపురుగు క్రింద జమకడ్తారు. ఆ దీపెసెల తోనే తను వెనక్కు వచ్చేస్తుంది. పవిత్ర దైవాన్ని కనీసం ఒక్కనాడూ ఆలయంలో వీక్షించ లేక పోయింది.

మహాత్ముల చిత్రాలు తెచ్చి పూజించటానికి; తన నివాసం పాపానికి నిలయం. ఆ చిత్రాల్ని కొంటా నికికూడా ఉపయోగించే డబ్బు పాప ప్రమేయం. సుధ సాహసించలేక పోయింది. అభిమానం కొద్దీ కనీ కనపడకుండా, బూజుపట్టిన ఆగోడ మీద "దైవం" అని మాత్రం పెన్సిలుతో వ్రాసింది. ఆ మూడక్షరాల మాటే ఆమె ఆరాధ్య మూలం.

ఆ మాటను చూచినప్పుడల్లా "అమ్మా! పరిస్థితుల ప్రభావం; ఈ స్థితిలోనిన్ను బంధించినా ఆచరించే మార్గం నలుగురికి అటంకం...... దీన్నుండి తొలగిపో తల్లీ" అంటూ ప్రభోధించేది అంతరాత్మ.

సుధకు ఆలోచించినంతవరకూ సత్యం గోచరిం చక పోలేదు. అంతర్వాణి ప్రబోధం మూడు మార్గాలా, యదార్థం. ఈ నాడు తను ఆ వృత్తికి స్వస్తి చెప్పకుందామనుకున్నా ఆకటి బాధను తీర్చు కునేదెలా ? పరిస్థితుల ప్రభావం జయించ లేక పోవటమే, గొప్ప బలహీనత. ఆ బలహీనతకు లొంగి పోవటమే - ప్రతిపాపానికీ దారితీస్తుంది.

♦ ♦ ♦

సుధ, వణకుతున్న హృదయంతో గోడమీది దైవాన్ని స్మరించుకుంది. తన నిర్భాగ్య జీవితానికి కన్నీరు కార్చింది. పట్టణమంతా నిద్రా దేవి కౌగిలిలో నిద్రిస్తూంది. ఆమె కౌగిలిరుచి చూసే భాగ్యం తనకులేదు. రాత్రి రెండుగంటలైంది. ఆవేళ తను ఉపవాసవ్రతం చేసింది. కళ్లు కాంతివిహీనంగా తయారయినయ్. వీధి అంతా బురదమయం, ఆదినం ఇక తనకు ఆహారమంటూ లేదు.

ఆలోచనలనుంచి ఇవతలకొచ్చింది సుధ. బరువుగా నిట్టూర్చింది. "స్వామీ ! నా జీవితాన్ని మార్చు, నాకంటిన ఈ పాప పంకిలాన్ని నీ కరుణాపూరిత నేత్రాలతో కడిగివేయి. నన్ను నీదానిగా స్వీకరించు" అంటూ మొకరించింది. తన గోడమీది దైవమందు. "అమ్మా ! నా హస్తాలు నిన్ను చేర్చుకోవటానికి ఎప్పుడూ సిద్ధమే. పాప మానవులకోసం తన శరీరాన్ని చిత్రవధకు అంకితం చేశాడు ఏసుక్రీస్తు; దేశరక్షణకు తుపాకి గుండ్లకు హృదయాన్ని అర్పించాడు గాంధి. మోక్ష సాధనకై సుఖాలు త్యజించాడు గౌతముడు. వీరంతా నాబిడ్డలే. వెళ్లు తల్లీ; తోటి స్త్రీల జీవితాన్ని సరిదిద్దు, వారికి "మార్గదర్శి"గా జీవించు అంటూ అంతర్వాణి ప్రబోధించింది.

సుధ శరీరంలో నూతనశక్తి ఉద్భవించింది. స్వామి సన్నిధిలో చెమను హారించివేసింది. భారంగా లేచింది సుధ. సుధకు ఆదినం పర్వదినం. తనుండే వేశ్యావాడ గదికి గొళ్లెంపెట్టి మార్గదర్శిగా వుంటా నికి బయలు దేరింది విశాల ప్రపంచంలోని. పడుపు వృత్తిలో మగ్గిపోయే ఎందరు అభాగ్యులను మార్చి వేస్తుందో ఆమార్గదర్శి. అదంతా సర్వేశ్వరుని మహిమ!

---

# నాట్యకళ

శ్రీమతి పి. బాల



మానవునకు తిండి, బట్ట, వసతితో పాటు వినోదంకూడ కావాలి. నాట్యమనేది ఒక కళగా ఏర్పడకముందు మానవుడు వినోదం కొరకు తనకు తీరికగా ఉన్నప్పుడు గెంతులు వేయుటో, ఆడుటో, పాడుటో, ఇతరులను అనుకరించడమో చేస్తూ తాను ఆనందించేవాడు. తాను ఆనందించడమే కాకుండ ఇతరులను కూడ ఆనందింపజేస్తూ ఉండేవాడు. కొన్నాళ్ళకు అది క్రమబద్ధమై నాట్యకళగా మారింది. నాట్యకళకు మూలభూతమైన గ్రంథం భరతుని నాట్యశాస్త్రం. ఆయన తన గ్రంథంలో మొదటి అధ్యాయంలో తాను నాట్యశాస్త్రం వ్రాయటానికి కారణం ఏమిటో, దానికి తగిన సామగ్రి ఆయనకు ఎచ్చట లభించిందో ఈ విషయాలన్నీ వ్రాసాడు. పితామహా! విభిన్న క్షేత్రాలలో పనులు అలసిన ప్రజలకు వినోదం చేకూర్చడానికి ఏదైన ఉపాయం చేయుమని దేవతలంతా బ్రహ్మను వేడుకొన్నారట. అప్పుడు బ్రహ్మ దేవతల కోర్కెను తీర్చుటకై భరతమహామునిని తన సభకు రప్పించి ప్రజల వినోదానికని నాట్యశాస్త్రం వ్రాయుమని ఆనతిచ్చాడట. బ్రహ్మ ఆజ్ఞకు తిరుగుండా — వ్రాయవలసిందే. భరత మహాముని పాఠ్యభాగాన్ని ఋగ్వేదంనుండి, సంగీతాన్ని సామవేదంనుండి, అభినయాన్ని యజుర్వేదంనుండి, ముద్రలను అధర్వణవేదంనుండి తీసుకొని నాట్యశాస్త్రం వ్రాసాడు. శివుడు తాండవాన్ని, పార్వతి లాస్యాన్ని ప్రదానంచేసి ఆయనకు తోడుపడ్డారు. కోమలమైన అభినయాలకు పురుషులు పనికిరారు గాబట్టి వందలగొలది అప్సరసలను బ్రహ్మ సృజించి భరతమహామునికి సహాయపడవలసిందని ఆజ్ఞాపించాడు. భరతమహాముని ఈవిధంగా దేవుళ్ళ సహాయంవల్ల దేవతల కోర్కెను తీర్చాడు.

నాట్యమంటే ఏమిటి? ఈ రోజుల్లో నాట్యశబ్దాన్ని డాన్సుకు (dance) పర్యాయంగా వాడుతున్నారు. కాని అది సరికాదు. నాట్యశబ్దం వ్యాపకమైన అర్థం గలది. ప్రపంచంలోని మనుజుల ప్రవృత్తిని అనుకరించుట నాట్యమని (లోకవృత్తానుకరణం నాట్యమిత్యభిధీయతే) భరతముని అన్నాడు. డాన్సు అనేది నాట్యానికి అంగంగా వస్తుంది. డాన్సు అన్న పదానికి పర్యాయపదాలు నృత్యము లేక నృత్తము అను పదాలు అవవచ్చును. భావప్రదర్శన చేస్తూ చేసిన అంగవిన్యాసం నృత్య (భావాశ్రయంతు నృత్యంస్యాత్) యని చెప్పబడుతుంది. భావాభినయం లేకుండా కేవలం తాళాన్ని, లయను ఆశ్రయించు చేసిన అంగవిన్యాసం నృత్త (నృత్తం తాళలయాశ్రితం) మని చెప్పబడుతుంది. ఈవిధంగా నృత్తము, నృత్యము డాన్సు అను శబ్దానికి పర్యాయాలు కావచ్చు. నాట్యం సంభాషణలతోను, వివిధ ఘట్టాలతోను కూడి

ఉంటుంది. (వాక్యార్థీయం నాట్యంస్యాత్) అంటే, నాట్యమన్నా నాటకమన్నా ఒకటే అర్థం. నాట్యంలో ఆయా ఘట్టాలలో ఉపయోగించేవి నృత్తము నృత్యమున్నూ.

నాగరికత, విజ్ఞానం పెరుగటంవల్ల నాట్యకళే నేడు సినీమా కళగా మారింది. ఈనాడు సినీమాలు విభిన్న రంగాల్లో కూటికి గుడ్డకి పనిచేసి అలసి ఉన్న ప్రజానీకానికి వినోదాన్ని చేకూరుస్తూ ఉన్నాయి. నాటకాల్లో చూపించడానికి వీలులేని ఎన్నో సన్నివేశాలను ప్రజలు సినీమాలలో చూడగల్గుతున్నారు.

పూర్వకాలంలో నాటకాలైనా, నేటి కాలంలో సినీమాలైనా ప్రజలకు వినోదం చేకూర్చటమే వాటి ముఖ్య ఉద్దేశ్యం. వినోదంకొరకు ప్రారంభించిన ఈ సినీమాలు ఇతర విషయాలకు కూడ ఉపయోగింపబడుతూ ఉన్నాయి. కొన్ని సినీమాలు సమాజంలో నూతన విప్లవాన్ని కూడ తీసుకువస్తున్నాయి. మనుష్యుల నడతలోను, మనుష్యుల వేషభూషలలోనే కాక మనుష్యుల జీవితాలలోనే మార్పులు తిసుకొని వస్తున్నాయి. మానవునకు వివిధ రంగాలలో విద్యను వివేకాన్ని చేకూర్చడానికి సమాజంలో ఆయా సంస్థలు పని చేస్తున్నాయి, మనుష్యుని ఒక ఆదర్శ నాగరికునిగా తయారుచేయుటకు మనం సినీమాలవల్ల, నాటకాలవల్ల- విశేషంగా అపేక్షించడం వాటి ముఖ్యోద్దేశానికి విరుద్ధమేమో అనిపిస్తుంది. అందుకనే "దశరూపక" మనే గ్రంథాన్ని వ్రాసిన ధనంజయుడనే కవి ఇలా అన్నాడు.

"రామాయణం, మహాభారతం, ధర్మశాస్త్రాలు మున్నగు గ్రంథాలవల్ల విజ్ఞానం సంపాదించినట్లు ఆనందాన్ని స్రవించే రూపకాల (నాటకం, ప్రకరణం మున్నగు పది రకాల రూపకాలు) నుండి కూడ కేవలము విజ్ఞానాన్ని అపేక్షించే వ్యక్తి తెలివి తక్కువ పెద్దమ్మ. రుచి ఎరుగని అట్టివానికి ఇదే నా నమస్కారం."

(ఆనందనిఃష్యందిషు రూపకేషు,
వ్యుత్పత్తి మాత్రం ఫలమల్ప బుద్ధిః।
యోపేతిహాసాది వతత్రచాహ
తస్మైనమః స్వాదుపరాఙ్ముఖాయ)

ధనంజయుని పై శ్లోకంవల్ల నాట్యకళ యొక్క ముఖ్య ఉద్దేశ్యం ఉదయంనుండి సాయంకాలం వరకు ఆయా రంగాల్లో పనులుచేసి అలసి వినోదం కొరకు ఆనందం కొరకు ఎదురుచూచే ప్రజకు వినోదాన్ని ఆనందాన్ని చేకూర్చటమే. ఆనందంతో పాటు విజ్ఞానం, వివేకం కూడ చేకూరుతే ఎవరైన వద్దని అంటారా? అట్లే ఈనాడు, నాటకాల స్థానే వచ్చిన సినీమాల ముఖ్య ఉద్దేశ్యం కూడ ప్రజలకు ఆనందాన్ని, వినోదాన్ని కలుగజేయుటయే అయి ఉండాలి. కొన్ని సినీమాలు ఆనందంతోపాటు విజ్ఞానాన్ని, వివేకాన్ని కూడ చేకూరుస్తూ ఉన్నందుకు వాటి నిర్మాతలకు, దిగ్దర్శకులకు, నటీనటులకు మన మంతా కృతజ్ఞులం కావాలి.

---

# వింధ్యాద్రి గర్వభంగము

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ



(గత సంచిక తరువాయి)

అని చెప్పిన తర్వాత గౌతమ మహర్షిని యుద్దేశించి, ఓ మహర్షీ, నీవు ఓంకారస్వరూపుడవు. ఈమె శృతి స్వరూపిణి. ఈమె తపస్సు నీవు స్వయం తపస్సువు. ఈమె సత్క్రియ. నీవు దాని ఫలమువు. ఈమె పాతివ్రతమైన తేజస్సు. నీ పరబ్రహ్మ తేజస్సువు. అదీ కాక తపః సంబంధమైన తేజస్సు నీవద్ద ఉన్నది. కావున నీకసాధ్యమైన వస్తువు ఈ ప్రపంచంలో లేదు. నీకు తెలియని విషయముకూడ ఈ ప్రపంచములో లేదు. అయినా ఇంద్రాది దేవతలంతా నీ నద్దకు వచ్చుటకు కారణం చెప్పుచున్నాను వినుము. వీరంతా నిన్ను యాచించుటకు వచ్చారు. వింధ్యపర్వతం మేరుపర్వతంతో స్పర్థచేస్తూ సూర్యమార్గాన్ని అడ్డు పెట్టింది. అది గొప్పగా గర్వించి ఉన్నది. దాని గర్వాన్ని అణచి ఒకప్రక్క కేవలం అంధకారంతోను, వేరొక ప్రక్క తీక్ష్ణతాపంతోను బాధపడుచున్న ప్రాణికోటిని రక్షించవలసినదని నిన్ను ప్రార్థించుటకు వచ్చారు, ఈ సురాసురాదులంతా. బృహస్పతి చెప్పినమాటలు విని అగస్త్యమహర్షి క్షణకాలమాగి ఈవిధంగా పల్కాడు. సురాచార్యా! తప్పక దేవకార్యం చేస్తాను. సురులతోసహా నీవు సుఖంగా స్వర్గానికి పొమ్మ అనిచెప్పి మరల ధ్యానపరుడయ్యాడు.

ఇంద్రాదులు తమతమ చోటులకు పోయిన తర్వాత అగస్త్యమహర్షి తన అర్ధాంగి లోపాముద్రలో ఈవిధంగా పల్కాడు. ప్రియురాలా, విన్నావా, ఇది ఎక్కడి చోద్యము. ఘనమైన యీ కార్యమెక్కడ? మునుల మార్గాన్ని అనుసరించి జీవించు మనమెక్కడ? ఇంద్రుడు మూడు లోకాలకు అధిపతి. పూర్వకాలంలో ఆయన తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను తెగనరికాడు. అతని ప్రాంగణంలో కల్పవృక్షాదులన్నీ నిలచి ఉన్నాయి. అట్టి పరాక్రమవంతుడు ఈ చిన్న పనికి మనలను అభ్యర్థించడం చాల ఆశ్చర్యంగా లేదూ! అగ్ని తన దావాగ్నిచేత పర్వతాల నన్నింటిని వ్యాకుల పెట్టుచున్నాడే అట్టివాడు ఒక పర్వతంయొక్క పెరుగుదలను అపజాలడా? యమధర్మరాజు సమస్త భూతాలను నియంతగద. అట్టివాడు ఒక పర్వతాన్ని దారిలోకి తీసుకొని రాజాలడా. ఇంకా, ఆదిత్యులు, వసువులు, రుద్రులు, మరుద్గణములు, విశ్వేదేవులు, అశ్వినీదేవతలు మున్నగువారున్నవారే, వారిలో ఏ ఒక్కరి దృష్టిపడినా ప్రపంచమంతా భస్మీపటల మగునే అట్టివారు వింధ్యపర్వతముయొక్క గర్వాన్ని అణచలేరా? ఈ సందర్భంలో "శ్రేయాంసి బహు విఘ్నాని" అను సుభాషితం నాకు జ్ఞాపకం వస్తున్నది. కాశీలో నివాసంచేస్తూ తపస్సు చేసుకొనే వారికి ఏవేవో విఘ్నాలు వస్తూనే ఉంటాయి. ఓ కల్యాణీ! నేడు మనకికూడ అట్టి విఘ్నమే సంభవించింది. మనకు విశ్వేశ్వరుడు విముఖంగా ఉన్నాడు. ద్విజాల ఆశీర్వాదముచే పొందిన కాశిని మోక్షముగోరు నరుడెందుకు విడచిపోవును? హృద్యమైన చేతిలోని కబళాన్ని విడచి మట్టిముద్దను ఎవరైనా మింగుదురా? సుకృతైక రాశియైన కాశి జనులెందుకు విడచెదరు? వారు మూర్ఖులా ఏమి? జన్మాంతరకృత పుణ్యపరిపాక వశముచే పొందిన కాశీనగరిని విడచి వెళ్లుటకెవరైనా యిష్టపడుదురా? పాపరహితమై, దేవతలకు పొంద శక్యముకానిదై, స్వచ్ఛమైన గంగాజలముచే పవిత్రమై, సంసార పాశములకు కాపభూతమై సదాశివునిచే విభూషితమైన కాశీనగరిని ముక్తులైన నరులు కూడ త్యజించుటకు ఒప్పుకోరు. గబగబా ప్రవహించు గంగాజలముచే మనోహరమై ప్రళయకాలమందు కూడ శివుని శూలాగ్రముచే సుధరింపబడియున్న వారణాసిని విడచి ఎవరైనా యితర స్థలములకు పోవుటకు ప్రయత్నించు నెడల యది వారి మూర్ఖత్వముకాక వేరొకటి కాదు. అవి ముక్తక్షేత్రమువంటి క్షేత్రము ముల్లోకములలోను లేదని శృతులు, స్మృతులు, పురాణములు ఘోషిస్తున్నాయి. వరుణ, అసీనదుల మధ్య నుండుటచేత దీనికి 'వారణాసి' అని పేరు గల్గింది. అవిముక్త మహాక్షేత్రాన్ని విడచి యితర స్థలాలకు పోవు నరుడు చేతియందలి ముక్తిని విడచి దానిని వెతుకుటకై వేరొక స్థలానికి పోవుచున్నాడన్నమాట. అని యీవిధముగా పలుసారులు అనుకొని ప్రభువైన

విశ్వనాథునితోను, కాలభైరవునితోను, ఢుంఢి వినాయకునితోను, దండపాణితోను, ఈ విధముగా మొరబెట్టుకున్నాడు. "ఓ ప్రభూ, విశ్వనాథా, ఓ కాలభైరవా, ఓ దండపాణీ, ఓ ఢుంఢి వినాయకా, నేను చేసిన యపరాధమేమిటని నాకు కాశీతో వియోగమును గల్గించుచున్నారు." చివరకు శివుని యాజ్ఞ తప్పదురా అని నిశ్చయించుకొన్నవాడై అగస్త్య మహర్షి కాశీలో నివసించు మునీశ్వరులందరితోను తన ప్రయాణమును గూర్చి చెప్పి, ఆబాలగోపాలముచే వీడ్కోలు ఇవ్వబడినవాడై నగరి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణము చేసి యీ విధంగా అనుకొన్నాడు. ఈ లోకంలో ఎన్ని విధాల విఘ్నాలు అడ్డువచ్చినా చంద్రమౌళిని దర్శించి బయలు దేరువాని కార్యము తప్పక సిద్ధిస్తుంది. కాశీలో ఉన్న లతావృక్షగుల్మాదులే నయం. అవి ఎచ్చటకు కదలవు కనుక ఎవ్విధమైన పాపము చేయజాలవు. మనమో జంగమములము. కావుననే ఈ పవిత్రక్షేత్రాన్ని విడచి వెళ్లిపోతున్నాము. మనకు ధిక్కారముగాక, అని గంగానదిని స్పృశించి నగరిలోని సౌధపంక్తులను చూస్తూ తన నేత్రాలను సంబోధించి యీవిధంగా అన్నాడు. ఓ నేత్రములారా, ఈ కాశీ మహాపత్తనాన్ని బాగా చూడండి. ఇటుపైన మరల చాల దినాలవరకు ఈ నగరిని దర్శించే భాగ్యం మీకు కలుగబోదు అని పల్కి చప్పట్లు కొట్టి బిగ్గరగా నవ్వుతూ ఓ భూతగణములారా, నేను కాశీని విడచి పోవుచున్నాను, అని పలుసార్లు చింతించి యగస్త్య మహాముని క్రౌంచపక్షుల ద్వంద్వమువలె కేవలము స్త్రీ సహాయుడై ఓ కాశీ, ఓ కాశీ, తిరిగి నాకు దర్శనమిస్తావు కదూ అని చెప్పి మూర్ఛపోయాడు. కొంత తడవు అయిన పిదప మూర్ఛనుండి లేచి శివశివా యని మూడుసార్లు ఉచ్ఛరించి లోపాముద్రతో ఓ ప్రియురాలా, ఇక వెళ్లెదము లే, దేవతలెంత కఠినాత్ములో తెలుసా— పూర్వము వారు మన్మథుని ఈశ్వరుని వద్దకు పంపి ఏమి చేసిరో నీకు జ్ఞాపకమున్నది కదా? అని చెప్పి నాలుగయిదు అడుగులు ముందుకు వెళ్లుసరికి ఆయన నుదుటనుండి చెమట బిందువులు రాలాయి. అగస్త్య మహర్షి వచ్చుచుండగా లేచి నిలచి నమస్కరించలేదను భయముచేవలె భూమి సంకోచాన్ని పొందింది. ఎందుకనగా ఎవరైనా పెద్దవారు వచ్చునప్పుడు చిన్నవారి ప్రాణములు పైకి లేచిపోవును. నిలచి అభివాదనము చేయునప్పుడు మరల యథాస్థానానికి వచ్చును.

(ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆయతి। ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే॥).

అగస్త్య మహర్షి తపస్సనే యానముచే త్వరలోనే ఆకాశాన్ని అంతా ఆవరించి ఉన్న వింధ్యపర్వతాన్ని చూడగల్గాడు. అప్పుడు వింధ్యాద్రి భార్యాసమేతుడైన అగస్త్య మహర్షిని ఒక్కసారిగా కంపించింది. ఎందుకంటే దానికి అగస్త్య మహర్షియొక్క పరాక్రమాన్ని గూర్చి బాగా తెలుసు. ఈ మహర్షి లోకభక్షకులైన వాతాపి, యిల్వలుడు అను రాక్షసులను జీర్ణం చేసుకొన్నాడు.

తపస్సువల్ల, క్రోధంవల్ల, కాశీ మహానగరిని విడచుటవల్ల పుట్టిన మూడు అగ్నులచే మండుచున్న అగస్త్య మహర్షిని చూచి వాని ధాటికి తాళలేక వింధ్య పర్వతం వెంటనే పొట్టిదై భూమిని ప్రవేశించునా యనునట్లు వంగినదై అగస్త్య మహర్షిని సంబోధించి మునిశ్రేష్ఠా, ఏమి ఆజ్ఞ అని పల్కెను. అప్పుడు అగస్త్య మహర్షి, ఓ వింధ్యాద్రీ, లెస్స, లెస్స, నీవు చాల ప్రాజ్ఞుడవయ్యా, నా సంగతి బాగా తెలిసినవాడవు. నేను మరల తిరిగి వచ్చువరకు ఇచ్చటనే హ్రస్వరూపుడవై యుండుము. అని చెప్పి భార్యాసమేతుడై దక్షిణదిక్కుగా బయలుదేరెను. అగస్త్య మహర్షి వెళ్లిన తర్వాత వింధ్యపర్వతం తనలో తాను ఇట్లు అనుకొన్నది. అబ్బా, ప్రాణములు తిరిగి లేచి వచ్చాయి. నేనెంత ధన్యుడనో కదా. లేనియెడల యగస్త్య మహర్షి నన్ను శపించి యుండెడివాడు కద. ఆ సమయంలో సూర్యసారథియైన యనూరుడు గుఱ్ఱాలను తోలనారంభించాడు. సూర్యగమనానికి అడ్డు తొలగటంవల్ల ప్రపంచమంతా యెప్పటియట్లు నడువసాగింది. సూర్యభగవానుడు ఎప్పటియట్లు ఉదయింపసాగాడు. వింధ్యపర్వతము అగస్త్య మహర్షి యిప్పుడు వచ్చునో, అప్పుడు వచ్చునో యని ఆక్రమింపబడిన వానివలె చింతాభారముచే కృంగిపోయాడు. ఇంకా మునీశ్వరుడు తిరిగి రాలేదే, నేనిట్లే యుండవలయునా? నాకిక పెరుగుదలకు అవకాశము లేదా అని పలువిధాల చింతింపసాగాడు. మేరుపర్వతంతో స్పర్ధ చేసి వృద్ధి పొందగోరిన వింధ్యపర్వతంయొక్క స్థితి, పరులపైన అసూయచేత వృద్ధిని పొందగోరిన ఖలుని స్థితివలె ఏర్పడ్డది. [illegible] మోసము వచ్చినట్లు [illegible] ఉన్న ఔన్నత్యంకూడ [illegible] లేకపోయింది.

ఇక్కడ యీ విధంగా వింధ్యపర్వతం దుఃఖిస్తూ ఉండగా, గోదావరీ తీరాన్న విహరిస్తూ ఉన్న అగస్త్య మహర్షికి యింకా కాశీవియోగంవల్ల కల్గిన సంతాపం యింకా తగ్గలేదు. ఉత్తర దిక్కునుండి వచ్చిన వాయువునైనా ఆయన కౌగలించుకొని కాశీ నగరి కుశలంగా ఉన్నదా అని కుశలప్రశ్న వేయు చుండేడివాడు. తరువాత, లోపాముద్రతో, ఓ ప్రియురాలా, ఈ ప్రపంచములో ఎచ్చటనుకూడ కాశీ నగరిలో ఉన్న ముద్ర కనపడదు. దానికి కారణం కాశీనగరి బ్రహ్మచే నిర్మింపబడకుండుటయే అనిచెప్పి ఒక్కొక్కచోట నిల్చుచూ, ఒక్కొక్కచోట పరుగులెత్తుచూ, ఒక్కొక్కచోట తొట్రుపడుచూ, ఒక్కొక్కచోట కూర్చొనుచూ, ఈ విధంగా ఉన్మత్తునివలె తిరగటం ప్రారంభించాడు. ఇట్లు తిరుగుచున్న అగస్త్యమహర్షికి నూరు చంద్రుల కాంతి గల్గిన శ్రీ మహాలక్ష్మి తన మనస్తాపాన్ని పోగొట్టునదివలె ప్రత్యక్షమయింది. మహర్షి ఆమెకు సాష్టాంగప్రణామం చేసి యీ విధంగా స్తోత్రం చేసాడు.

ఓ తల్లీ నీకు నమస్కారము. నీవు తామరపువ్వు రెమ్మలవలె విశాలమైన నేత్రములు గలదానవు. విష్ణుమూర్తి హృదయపద్మము, నీ నివాసస్థానము. చరాచరమైన యీ జగత్తుకు నీవు తల్లివి. నీవు పాల సముద్రమునుండి పుట్టినావు. పద్మముయొక్క కోమలమైన మధ్యభాగమువలె తెల్లనైనదానవు. నిన్ను శరణు పొందినవారిని అనుగ్రహించు తల్లీ, ఉపేంద్రుని గృహములో నీవు లక్ష్మివి, మన్మథుని తల్లివి. చంద్రునిలో నీవు వెన్నెలవు. చంద్రునివలె మనోహరమైన మొగము కలదానవు. సూర్యునిలోని కాంతివి నీవే. ముల్లోకములలోను వెలిగే వెలుగు నీవే. అగ్నిలోని దహించే శక్తియు నీవే. వేదాలకు విచిత్రమైన యీ ప్రపంచానికి నీవే కారణం. ఈ ప్రపంచాన్నంతా భరించే విష్ణుమూర్తి కూడ నీచే భరింపబడుతున్నాడు. ఈ ప్రపంచంయొక్క సృష్టి, స్థితి, లయాలకు నీవే కారణభూతురాలవు. నీవు విష్ణుమూర్తిని వరించుటవల్లనే ఆయన అందరిచే కొనియాడబడుచున్నాడు. ఓ మంగళప్రదురాలా, ఏ పనిమీద కరుణతోకూడిన నీ క్రీకంటిచూపు పడునో, అతడే ధన్యుడు. అతడే శూరుడు, అతడే గుణవంతుడు, అతడే పండితుడు, అతడే గౌరవింప తగినవాడు. అతడే కులీనుడు, అతడే శీలవంతుడు. ఈ లోకములోనెల్ల అయనే పవిత్రాత్ముడు. ఓ లక్ష్మీ మహాతల్లీ, ఈ ప్రపంచంలో నీచే తాకబడిన వస్తువే పవిత్రమైనది. నీచే విడువబడినది, అపవిత్రమైనది. నిన్ను సదా జపించువాళ్లకు ఈ ప్రపంచములో దుఃఖమన్నది కల్గునా? అని యీ విధముగా స్తోత్రముచేసి అగస్త్య మహర్షి సపత్నీకుడై యామెకు మరల సాష్టాంగ నమస్కారం చేసాడు. లక్ష్మీదేవి యీ విధంగా పల్కింది:-ఓ మైత్రావరుణా, లెమ్ము, నీకు శుభముగుగాక. లోపాముద్రా నీవుకూడ లెమ్ము. మహర్షివర్యా, నీవు చేసిన స్తుతికి నేను మిక్కిలి సంతసించాను. నీకు కావలసినది కోరుకొనుము. ఓ లోపాముద్రా, నీవు రాజ పుత్రికవు, మహాభాగ్యవతివి. ఇట్లా కూర్చొనుము. నీ శరీరము పవిత్ర వ్రతములచేతను దానశాస్త్రముల చేతను తపింపబడినది. ఇదుగో నేను నీ శరీరమును చల్లబరుచుచున్నాను. అని చెప్పి లక్ష్మీదేవి లోపాముద్రను కౌగలించుకొని సౌభాగ్యప్రదములైన అనేక ఆభరణములను ఆమెకు ఇచ్చింది. తరువాత పద్మాలయ మునీశ్వరుని సంబోధించి యిట్లా అన్నది. నీ హృదయ తాపానికి కారణం నాకు బాగా తెలుసు. కాశీ వియోగమువలన గలుగు తాపము ప్రాణిమాత్రాన్ని తపింపజేస్తుంది. ఇందులో సందేహము లేదు. పూర్వం విశ్వేశ్వరుడు కాశిని విడచి మందరపర్వతమునకు వెళ్లినపుడు కాశీనగరి దురవస్థ యింత అంత అని చెప్పనలవికాదు. అప్పుడు విశ్వేశ్వరుడు బ్రహ్మను, విష్ణువును, తన గణములను కాశీనగరి పరిస్థితి యెట్లున్నదో తెలుసుకొని రండని పంపాడు. అప్పుడు వారు కాశీకి వెళ్లి దాని గుణగణాలను పరిశీలించి దానిని విడిచి యొచ్చటకు వెళ్లక అచ్చటనే ఉండిపోయారు. అట్టి మాహాత్మ్యం గలది కాశీనగరం. కాశీనగరివంటి నగరి యీ మూడులోకాలలోను లేదు. లక్ష్మి చెప్పిన మాటలు విని యగస్త్యమహర్షి ఆమెకు మరల నమస్కరించి యిట్లా చెప్పసాగాడు. ఓ తల్లీ, నీవు నిజముగ వరం నాకు ఇవ్వదలచుకున్న యెడల తిరిగి నాకు కాశీప్రాప్తి కలుగునట్లు చేయుము. అదియే నా కోరిక. మరియొక మాట. నేను నీ గురించి చేసిన స్తోత్రమును పఠించు నరులకు దారిద్ర్యము లేకుండుగాక. అట్టివారలకు ఇష్టజన వియోగము, సంపత్తినాశము సంతాన నాశము లేకుండ అన్నిచోట్ల విజయము చేకూరుగాక. అంతట లక్ష్మీదేవి మునీశ్వరా! నీవు కోరిన ప్రకారము వరమిస్తున్నాను. మరియొక మాట. రాబోవు ద్వాపర యుగములో నీవు వ్యాసుడవై పుట్టి మరల కాశీని పొందగలవు. అప్పుడు నీవు వేదసంపదను నాలుగు భాగములుగ విభజించి పురాణములను రచించి లోకములో ధర్మ ప్రచారము చేయగలవు.

(సశేషము)

# స్నేహితులు

శ్రీమతి పి. సుభద్రాకుమారి



రాధ జమీందారు కూతురు. లలిత ఆ యూళ్లోనే రంగనాథంగారి కుమార్తె. అయితే రంగనాథంగారికి ఆరుగురు ఆడపిల్లలగుటచేత, మగ సంతానం లేకపోవడంచేత లలితకు చిన్నప్పటినుండి పిల్లవాని దుస్తులతో ముస్తాబుచేసి అల్లారుముద్దుగా పెంచేవారు. లలిత, రాధ చిన్నప్పటినుండి ఒక స్కూలులోనే చదువుకుంటూ ఆప్త మిత్రులుగా మెలగేవారు. రంగనాథంగారి అమ్మాయికి లలిత యని నామకరణం చేసినా యింటిల్లిపాది సుందర్! అని పిలుస్తూ యుండేవారు. స్కూలులోకూడ సుందర్ అనే పిలచేవారు. ఇద్దరూ స్కూలు ఫైనలు పరీక్ష పాసయినారు. రంగనాథంగారి అమ్మాయి మాత్రం పెద్ద చదువులకని మద్రాసుకు వెళ్ళింది. జమీందారు రాధకు యీడుజోడు చూచి సుధాకర్‌కు యిచ్చి వివాహం చేశారు. కొంతకాలానికి ఆమె అత్తగారింటికి వెళ్ళింది.

ఒకరోజున రాధ కాఫీ తయారుచేసి హాలులో కూర్చొనియున్న సుధాకర్‌కు తెచ్చింది. సుధాకర్ ఏదో కాగితం చదువుతూ ఆమె వంకైనా చూడ్డలేదు. రాధ అలాగే చాలసేపు నిలబడి "కాఫీ చల్లారిపోతున్నది - దాన్ని సావధానంగా చదువుకోకూడదూ!" అన్నది కాఫీకప్పు యున్న బల్లను ముందుకు జరుపుతూ. సుధాకర్ ఏమీ మాట్లాడకుండా కాగితమును మడిచి జేబులో పెట్టుకొని లేచి వెళ్ళిపోయాడు. ఆనాటినుండి సుధాకర్‌లో మార్పువచ్చింది. సరిగ్గా మాట్లాడడు - ఏదో తిన్నపూట నాలుగు మెతుకులు తిని పరాయివాడిలాగ పరగళ్ళ పరగళ్ళ తిరుగసాగాడు. రాధకు యిదంతా అయోమయంగా నుండింది.

ఒక ఆదివారంనాడు పుస్తకాలు గుడ్డలు విదిలించి సర్దుకుంటుంటే అందులోనుండి ఒక ఫోటో క్రిందపడింది. అది చూచేసరికి దానివెనుక ప్రేమతో 'సుందర్' అని యుంది. సుధాకర్ కండ్లు భ్రమించినవి. అనుమానం బలపడింది. శీలాన్ని శంకించాడు. రాధ అతని కండ్లకు నీచంగా కనుపించింది. ఏ విధంగానైనా ఆమెను పుట్టింటికి పంపివేయదలచాడు. తన కామెతో సాంగత్యము పనికిరాదనుకున్నాడు. రాధ మూడు మాసముల గర్భిణి యని తెలియగానే పుట్టింటివారు వచ్చి పిలుచుకొనిపోకపోయినా తనే ఆమెను పంపేసి, కనీసం జాబైనా వ్రాయడం మానేశాడు. రాధ భర్తవైఖరికి కలవరపాటు చెందింది. తను ఎన్నో జాబులు వ్రాసింది. తండ్రిచేత, తమ్ములచేత వ్రాయించింది కాని సుధాకర్ మాత్రం జాబూ వ్రాయలేదు - ఒక్కసారైనా వచ్చి చూచిపోలేదు. నవమాసాలు నిండి పండంటి మగబిడ్డను కన్నది రాధ. అందరూ చూచి ముచ్చట

పడ్డారు కాని సుధాకర్ మాత్రం వచ్చి చూడలేదు.

సుధాకర్ జీవితం పిచ్చివానిలాగైంది. హోటలులో తిని, అక్కడక్కడ తిరిగి ఎప్పుడో వచ్చేవాడు. ఆఫీసుకైనా తప్పని సరిగా వెళ్ళవలసి వచ్చిందే అన్నట్లు వెళు తుండేవాడు. స్నేహితులు, బంధువులు అతనిలోని మార్పును గుర్తించి కారణం అడిగినా బదులు చెప్పేవాడు కాడు. క్రమంగా మానసిక బాధతో ఆరోగ్యాన్ని సయితం కోల్పోయాడు.

బాగా జ్వరం తగిలియుంది. తనొక్కడే గది తలుపేసుకొని లోపల దుప్పటి కప్పు కొని పండుకొనియున్నాడు. ఇంతలో ఏవరో రాధా! రాధా! అని పిలుస్తూ తలుపు తట్టారు. ఎవరో - స్త్రీ కంఠంలాగున్నది. సుధాకర్ మెల్లగా లేచివెళ్ళి తలుపు తీశాడు.

"రాధ లేదండీ!"

"లేదు. పుట్టింట్లో యున్నది. మీరు ఆమెతో ఏదో పనియుండి వచ్చినట్లున్నది!" అన్నాడు కటువుగా సుధాకర్.

"పని అంటూ ఏమిలేదు కాని మే మిద్దరం బాల్యస్నేహితులం. చూచి పోదా మని .."

"ఓహో! అలాగా! మీ పేరే మిటో...."

"నాపేరు సుందర్. మా నాన్నగారు మగసంతానం లేక నాకు సుందర్ అని పేరుపెట్టి పిలుస్తూ మగదుస్తులతోనే ముస్తాబుచేసి మోజుపడేవాడు."

"అంటే.. సుందర్ మీరేనా! రాధకు రెండు మూడు జాబులుకూడ వ్రాసినట్లు న్నది..."

"అవునండీ! ఒక్క జాబుకైనా ఆమె జాబు వ్రాసింది కాదు" అన్నది కొద్దిగా కోపంతో.

సుధాకర్ తన పొరబాటుకు, అపోహ లకు నాలిక కొరుక్కున్నాడు.

"హోటలునుండి కాఫీ, టిఫెను తెప్పించి పెడతాను ఉండండి" అంటూ కుర్చీ చూపించి కూర్చోమన్నాడు.

"ఏమీ వద్దండీ! - మీరూ ఏదో సుస్తీగా నున్నట్లున్నది" అన్నది లలిత.

సుధాకర్ మనిషిని పంపి కాఫీ, టిఫెను తెప్పించాడు. తనూ ఆమెతోబాటు కొద్దిగా కాఫీ త్రాగి ఆమెను సాగనంపాడు.

రాధ తనభర్త రాకపోయినందులకు పరిపరివిధాల ఆలోచనలతో దిగులుగా నుండేది. ఒకరోజున లలిత ఆమెను చూడ డానికని వెళ్ళి పిల్లవాణ్ణి ఎత్తుకొని ముద్దా డింది. ఇంటిల్లిపాది సంతోషపడ్డారు కాని రాధ ముఖముమీది విషాదఛాయలు లలితను కలవరపరిచినవి. కారణమడిగి తెలిసికోవాలని విశ్వప్రయత్నం చేసింది కాని ఏమి లాభం లేకపోయింది. లలిత రాధతోబాటు యుండి పదిరోజులు గడుప దలచింది. ఉన్నట్లుండి ఒకరోజు సాయం కాలం సుధాకర్ వచ్చి టాక్సీ దిగాడు. అతనిని చూచి రాధ ముఖం వికసించింది. రాధ తల్లిదండ్రులు ఆనందపరవశు లయ్యారు. బావమరుదులు "బావగారు

దారితప్పి యింటికి వచ్చినట్లున్నది'' అని చెప్పిపోడిచారు.

రాత్రి భోజనాలయాక రాధ, లలితలను చూచి సుధాకర్ వంచినతల పైకెత్తలేక పోయాడు. రాధ తమలపాకులు చీల్చి సున్నం రాయుచూ ''ప్రభువులకు యీనాటికి దయ కలిగినట్లున్నది!'' అన్నది.

''రాధమీద పగ పూనారట ఏమిటి సుధాకర్‌గారూ!'' అన్నది లలిత.

''అయినా, నా రాధ నన్ను క్షమిస్తుందిగా!'' అన్నాడు మెల్లగా లలితవంక చూస్తూ సుధాకర్.

''క్షమించడమేమిటండీ! అసలేమిటీ గొడవ?'' అన్నది లలిత.

''మీరొకప్పుడు వ్రాసిన జాబు చూచి రాధకు ఎవరో పరాయి పురుషునితో సంబంధమున్నదని అపోహపడ్డాను. దాంతోబాటు పురుష దుస్తులలోనున్న మీ ఫొటో - వెనుక ప్రేమతో 'సుందర్' వ్రాసియున్నది రాధ పుస్తకాలలో నుండి బయటపడింది. ఇవి రెండు రాధను అపార్థం చేసికొనేట్లు చేసినవి. దాంతో విరక్తి కలిగి రాధను పంపేసి యింతకాలంనుండి చూడడానికైనా రాలేదు. మీ మూలంగా అసలు విషయం తెలిసింది. పశ్చాత్తాపంతో పరుగెత్తుకుంటూ వచ్చాను. మరి రాధ అనుగ్రహిస్తుందో లేదో...''

రాధ కండ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. వెక్కి వెక్కి ఏడ్వసాగింది. లలిత ''ఏమిటిది! పిచ్చిపిల్లా! చూడు పాపాయి నిన్ను చూచి బిక్కమొగం పెట్టాడు'' అన్నది.

రాధ, సుధాకర్‌లతో కులాసాగా కొన్నిరోజులు గడిపి తమ యూరికి వెళ్ళిపోయింది లలిత.

# శాస్త్రదృష్ట్యా మనిషి అమరుడే

## కాని "పెన్షను" మాత్రం ప్రాణాంతకమైన వ్యాధి ...

పశ్చిమ జర్మనీలో ఈ సంవత్సరం అరవయి డెభ్భయి (60 - 70) ఏళ్ల మధ్య వయస్సుగల వారెందరో అసంఖ్యాకంగా మరణించారు. వైద్యశాస్త్ర పరిశోధనా ఫలితంగా మానవుని వయోపరిమితి దినదిన ప్రవర్ధమానమవుతోందనీ మత గ్రంథాలలో సూచించిన "శతాయుస్సు" మానవుడు సాధించడమే కాక, అనతికాలంలో రెండువందల సంవత్సరాలవరకూ జీవించే పరిస్థితులు ఏర్పడుతున్నాయనీ, నేడు ప్రపంచంలో ప్రచారంలోవున్న సిద్ధాంతాలకి, పశ్చిమ జర్మనీలో జరిగిన యీ సంఘటన విరుద్ధంగా కనపడుతోంది.

అనేక మంది శాస్త్రజ్ఞులు, మనిషీ ముసలివాడు కావడం ఒక వ్యాధి అనీ, దానిని నిర్మూలించడానికి గాని, లేదా ఇతరవ్యాధులవలె కుదర్చడానికి గాని వీలయే సుదినం వస్తుందనీ ఆశిస్తున్నారు. దేహంలోని ఏ ఆంతరంగిక స్రావాలు లేక పదార్థాలు వ్యర్థం అవడంవల్ల వృద్ధాప్యం కల్గుతోందో కనిపెట్ట కల్గిననాడు, వృద్ధాప్యం పూర్తిగా నిర్మూలించడానికీ, మానవుని అమరత్వానికీ వీలవుతుందని శాస్త్రజ్ఞులు, వైద్యులు ఇంకా ఆశిస్తున్నారు. ఈ సిద్ధాంతం గనుక నిజమైతే, దేహం అవయవాలు వయస్సు వచ్చిన కొద్దీ కృశిస్తాయని జనబాహుళ్యంలోగల విశ్వాసానికి స్థానం ఉండదు. శాస్త్రజ్ఞులు యీ విశ్వాసాన్ని ఖండించడం కోసం, కండరాలు పరిశ్రమవల్ల బలపడతాయేగాని క్షీణించవనీ జీవమున్న ఏపదార్థం క్షీణించి కుళ్లిపోదనీ శాస్త్రజ్ఞులు వాదిస్తారు.

పశ్చిమ జర్మనీలోని హేంబర్గు విశ్వవిద్యాలయంలో పని చేస్తున్న సుప్రసిద్ధశాస్త్ర వేత్త ప్రొఫెసర్ జోరెస్ కూడా యీసిద్ధాంతాలని కొంతవరకూ బలపరచి, మనిషి నూరుసంవత్సరాల కన్న జీవించడన్న మాటలో సత్యంలేదని వాదిస్తున్న వారిలో ఒకడు. మానవుడు తన జీవశక్తి లేక అంతశక్తిని సద్వినియోగం చేసుకున్ననాడు, అతడు రెండువందల సంవత్సరాలవరకూ జీవించడానికి వీలుంటుందని అతని వాదం. సంపూర్ణ ఆయుర్దాయం దేహదార్ఢ్యంమీద అంతశ్శక్తి మీద మాత్రమే ఆధారపడి ఉండదనీ, ఒక నిర్ణీతమైన మార్గంలో పరిపూర్ణంగా పనిచేసే ఒక వ్యక్తి జీవితంలో, హఠాత్తుగా కలిగే సాంఘిక మనస్తత్వ పరిణామాలవల్లకూడా ఆయుర్దాయ పరిమితి ఆధారపడి ఉంటుందనీ ప్రొఫెసర్ జోరెస్ (Jores) సిద్ధాంతం.

ఈ సందర్భంలోనే చాలా కాలం పని చేసినతర్వాత, పెన్షను పుచ్చుకోవడం వల్ల, అకాలమరణాలకి దారి తీస్తోందన్న ఒక వాదం ఉత్పన్నమయింది. ఈ సిద్ధాంతంలోగల సత్యం పరిశీలించడం కోసం ప్రొఫెసర్ జోరెస్ పశ్చిమ జర్మనీలో చాలామందికి ఒక ప్రశ్నావళిపంపాడు. ఈ ప్రశ్నలకి అందిన సమాధానాల ననుసరించి తయారుచేసిన సంఖ్యావివరాల ప్రకారం, 58–65 ఏళ్ళవయస్సుల మధ్య, పశ్చిమ జర్మనీలో చాలా మంది మరణిస్తున్నారనీ, వీరంతా సగటున, పెన్షను పుచ్చుకొన్న అయిదారు సంవత్సరాలలోగా మరణించారనీ తేలింది. అందులోనూ పౌరశాఖ్యలలో పనిచేసేవారిలో మరణించిన వారి సంఖ్య, ఇతర వృత్తులలోనూ వర్తక వాణిజ్యాలలోనూ పనిచేసేవారితో పోల్చి చూస్తే పెన్షను పుచ్చుకున్న తర్వాత అంతమంది త్వరలో మరణించడానికి గల కారణం ఏమిటి? అన్న సమస్య శాస్త్రవేత్తలకి ఆశ్చర్యం కల్గిస్తోంది.

వైద్య శాస్త్రదృష్ట్యా, జీవశాస్త్ర దృష్ట్యా మనిషి జీవించడానికి ఒక పరిమితిలేదని తెలుస్తోంది. మనిషి పెరిగి పెద్దవాడవడం పుట్టిననాటినుంచీ జరిగే ఒక పరిణామమే కాని, 50 వ సంవత్సరంలోనే ఆరంభించి వృద్ధుడవడం జరిగేదికాదని వారి వాదం. కాగా అంతవరకూ వారు చేస్తున్న ఉద్యోగాలనుంచి వారు 50, 60 ఏళ్లవయస్సు మధ్య విరమించి పెన్షను పుచ్చుకోవడం, తప్పనిసరిగా జరిగే సంఘటన. ఇది వారు కోరుకోవడం చేతగాని, ఉద్యోగపరిమితి ఆఖరవడం చేతగాని జరుగవచ్చు. దీనివల్ల వారి మామూలు జీవితపద్ధతులలో మార్పుకలిగి, మనస్త

త్వంలో మార్పులు కలగడంవల్ల, వారు శీఘ్రగతిలో మరణించడానికి కారణభూతమవుతోందని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. దీని నిజానిజాలు తెల్సుకోవడం కోసం ప్రొఫెసర్ జోరెస్ హేంబర్గ నగరంలో పనిచేసి మరణించిన అయిదు వేలమంది పౌర ఉద్యోగుల జీవితచరిత్రలు పరిశీలించాడు. అతని పరిశోధనలవల్ల, ఈ ఉద్యోగులందరూ, జీవించాలన్న కృతనిశ్చయం పోగొట్టుకోవడంవల్ల మామూలుగా కలిగే వ్యాధులఫలితంగా మరణించారని ఆయన అభిప్రాయపడ్డాడు.

నేటి సంఘంలో పౌరశాఖలలోనూ, ఇతర పెన్షను ఉద్యోగాలలోనూ పనిచేసేవారు చాల కాలంవరకు కష్టపడి పనిచేసి కొన్ని పద్ధతులకి అలవాటయినతర్వాత, హఠాత్తుగా ఒక రోజున అతని శక్తి సామర్థ్యాలు, అవృత్తితో సంబంధం లేకుండా పనినుండి విరమించి పెన్షను పుచ్చుకుంటాడు. సంఘంవిధించిన యీ నిబంధనవల్ల, అతడు ఆ రోజు నుంచీ తన శక్తి సామర్థ్యాలు నిష్ప్రయోజన మయాయని జీవితంలో ఉత్సాహం పోగొట్టుకుంటాడు. జీవిత రంగంలో ఆఖరిఘట్టం ప్రవేశించామనీ, తమవల్ల సంఘానికి ఏ ప్రయోజనం లేదనీ, మానసికంగా భావించడంవల్ల తనకి తెలియకుండానే ఆరోగ్యం క్షీణించే పద్ధతులు, పరిస్థితులు ఏర్పడతాయి. చేయగలిగినంత పని లేక శూన్యతాభావం ఆవరించి మనిషిని మరింత నిస్పృహునిగా చేస్తుంది. చిరకాలంగా తనకి అలవాటయిన పరిసరాలనుంచీ పద్ధతులనుంచీ పైదొలగి తాను ఎందుకూ పనికిరానివాడిననే భావిస్తాడు. దీనివల్ల అతను వ్యక్తిత్వం కోల్పోయి మానసికమైన వ్యాధులకి గురి అవుతాడని ప్రొఫెసర్ జోరస్ తన పరిశోధనల పలితంగా తెలియచేశాడు.

ఇతడు చేసిన సూచనలు వైద్యులుగమనించవల్సిన సూచనలు, పెన్షను పుచ్చుకున్నవారు ఆరోగ్యంగా ఉండేలా చూడాలంటే, వారికి ఆ మానసిక భావాలు తొలగించి, ఏదో ఒక వృత్తి, లేదా ఉద్యోగం, లేదా వారికి అభిలాషగల పని కల్గచేయాలని సూచించాడు. అతడు పశ్చిమజర్మనీలోని పారిశ్రామిక వేత్తలకీ, కంపెనీలకీ, ఒక హెచ్చరికచేస్తూ, "అత్యవసరమైతే తప్ప, లేదాతప్పనిసరి అయితే తప్ప, ఇతరత్రా, పనిలో ఉన్నవారికి వయోపరిమితి ననుసరించి పెన్షన్లు ఇచ్చి పంపివేయడం, వారికి ఉరిశిక్ష విధించినట్లవుతుందని ఉద్బోధించాడు.

("ఇంద్రా")

ఒక చెట్టుక్రింది జ్యోతిష్కుడు తనదగ్గరకు వచ్చిన ఒక స్త్రీని ఆమె అడిగే రెండు ప్రశ్నలకు పదిరూపాయలివ్వాల్సియుందన్నాడు.

ఆమె విస్తుపోతూ "చూడండి! రెండు ప్రశ్నలకే పదిరూపాయలడుగడం జాస్తి కదండీ!" అన్నది.

"అవునమ్మా! అవును – ఇక మీ రెండవప్రశ్న ఏదో అడుగండి" అన్నాడు జ్యోతిష్కుడు.

'సిసి'

(260 వ పేజీ తరువాయి)

లను పుచ్చుకోటమే మంచిదోవ అనుకున్నాడు. ఒక గ్లాసుకోసం అర్డరిచ్చాడు. గ్లాసు బుడ్డిగా మారి పోయింది. ఒకటా రెండా బుడ్లు?... అక్కడ వున్న వాళ్లు ఈ దృశ్యాన్నంతా చూస్తూ విస్తుపోతూ వున్నారు. ఎంతసేపని అక్కడ వుండటం?...చీకటి పడేలోపల ఇంటికి చేరుకోపోతే ప్రమాదం... ఇంటికి చేరుకున్నాక, అతని వాలకాన్నంతా చూశాక మాద్గా పూరకుంటుందా?...

తలనొప్పని సాకుతో తిన్నగా పడకగదిలోకి చేరుకున్నాడు ఎర్విన్. వికారం! బ్రహ్మాండమైన వికారం! అందరూ గాఢనిద్రలో నున్న సమయం. ఆదరాబాదరాగా స్నానాల గదిలోకి వెళ్లి వాంతులు చేసుకున్నాడు.... మరుసటిరోజున తిరిగి ఆ హోటలుకే బయలుదేరాడు. ఇంట్లో ఆఫీసుకు వెడుతున్నానని చెబుతూ... అర్ధరాత్రివరకు బసకూడా అక్కడే! తెల్లవజామునకు ఏదోవిధంగా ఇంటికి చేరుకున్నాడు. ఆరోజుకే బ్యాంకుకు వెళ్లాలసిన పనివుండి మాద్గా ఆ పని చూసుకున్నదో లేదో అక్కడినుంచి తిన్నగా వాళ్ళ ఆఫీసుకు వచ్చింది. అక్కడ భర్తలేడు. పనివాళ్లు జరిగిన సంగతంతా ఆవిడకు చెప్పారు...

ఎర్విన్ ఇంటికి చేరుకోటంలో, తలుపు బార్లగా తెరిచింది మాద్గా! అతని ఆకారాన్ని చూడటంతోనే మండిపోయింది....

తను ఇక ఏంచేస్తే ఈ కష్టాలనుంచి బయటపడవచ్చునో మాద్గా ఆలోచించింది. ఎంతోసేపు ఆలోచించింది. భర్త పెడదోవల్లో పడిపోయాడు. దాంతో కంపెనీ పేరు ప్రతిష్టలు పోతాయి. ఇక తను జాగ్రత్త తీసుకోకుండా వుంటే...

మొదట ఎర్విన్ వాళ్ళ డాక్టర్‌ని చూడాలి. డాక్టర్ ఇచ్చే సలహాప్రకారం తూచా తప్పకుండా నడుచుకోవాలి అని పట్టుపట్టింది మాద్గా. దీనికి ఒప్పుకోనని అన్నాడు మొదట. ఆవిడ కంట తడిబెట్టటంతో "సరేలే! నేనే ఆయన దగ్గరకు వెళ్తాను. కాని నువ్వు మాత్రం నావెంట రాకూడదు" అని ఒక షరత్తు పెట్టాడు. దానికి ఆవిడ అంగీకరిస్తూ, తను ఆరోజున చూసుకున్న పనినంతా చెబుతూ, దానికి సంబంధించిన కాగితాలమీద సంతకం చేయమని భర్తని కోరింది. దానికి అతను ఒప్పుకునే స్థితిలో వుంటేగా! మాద్గాను చెడమడ తిట్టాడు. తను వూళ్లో లేనప్పుడు కంపెనీ వ్యవహారాలు చూసుకోడానికి హక్కులేదని. చేయాలసిన రాద్ధాంతానంతా చేశాడు.

దాంతో మాద్గా రెచ్చిపోయింది. "చాలు, చాలు, నీ సంగసాచితనం. నీ మూలాన కంపెనీ దివాలా తీస్తుంది...నువ్వు పడిపోయ్యావు. ఎంత లోతులో పడిపోయ్యావో ఇప్పుడు నీకు అర్ధమవుతున్నదిగా! ...నువ్వు పడిపోవటంతో తృప్తిపడక, నన్నూ లాగ తలచావు. నువ్వు ఇలా మాట్లాడితివా నేనేం చెయ్యాలో నాకు బాగా తెలుసు..." అని చెయ్యి చేసుకుంది.

"అంత శక్తి నీకే వుంటే నువ్వు చెయ్యదలచిందంతా తప్పక చెయ్యి. దానికి భయపడుతా ననుకుంటున్నావా?...కాని ఏం చేయదలచావో కొంచెం చెప్పరాదూ మరి?..." అని అదమాయించాడు ఎర్విన్.

ఆ మాటకు మాద్గా ఒళ్లు మండిపోయింది. "సరేలే! నేనేం చేయదలచింది ఇక చెప్పివేస్తానుగా...ముందు మనం విడిపోవాలి..." అని వుద్రేకంగా అరిచింది మాద్గా.

ఆ మాటతో ఎర్విన్ పకపక నవ్వుతూ "అంతే కదూ? అది అంత సులభమైన పని అనుకుంటున్నావా?...ఎంతో కర్మకాండ వుంది. అదంతా అంత చకచక నడుస్తుందా?...కాని ఇంతకూ అసలు కారణమేమిటో కొంచెం చెప్పివేయరాదూ వింటాను?" అని ఎర్విన్ అన్నాడు.

ఆవిడకు ఆ కథనంతా చెప్పటానికి యిష్టంలేదు. దానికి సంబంధించిన పత్రాలను ఎప్పుడో సిద్ధం చేసుకుని వుంది. వాటిని అతనిముందు వుంచేసి వెళ్లిపోయింది.

ఎర్విన్ ఎగాదిగా వాటికేసి చూశాడు. వాటిని చూశాక ఎర్విన్ ఒకక్షణమైనా అక్కడ వుండిపోయే స్థితిలో వుంటేనా?...

ఆవిడ ఇచ్చిన కాగితాలను అమాంతంగా క్రిందికి విసిరేశాడు. దేహం కంపించిపోతున్నది. ఏదో జవాబు ఇయ్యాలని! పెదిమలు కదిలితేగా!...

ఈ దృశ్యాన్నంతా మాద్గా దూరాన్నుంచి చూస్తూ గబగబ అటుకేసి వచ్చింది. క్రింద పడిపోయిన కాగితాలను ఆదరాబాదరాగా ఎత్తుకుంటూ "ఇలా నాటకమాడాలనిఇష్టముంటే అలాగే ఆడు!...

కాని ఒక్క సంగతి చెప్పాలి! అది నీకు అంత ఇష్టం లేకపోయినా!...ఆ కాగితాల్లో వుదహరించిన కారణాలవల్ల చట్టం నాకు అనుకూలంగానే వుంది. నువ్వు చిల్లిగవ్వకూడా ఇందులో పెట్టలేదు. ఇల్లు నాది. ఇంటి సామాన్లన్నీ నావి. కంపెనీ స్థాపించిన దానికి మూలధనం పెట్టింది నేను...." అని వుద్రేకంతో, ఆవేశంతో ఏమేమో చెప్పబోతున్నది మాగ్దా. దీనికి ఏం జవాబు చెప్పాలి ఎర్విన్! నవ్వాడు. వెర్రివాడికి మల్లె నవ్వాడు. అలా చేయక మరేం చేయగలుగుతాడు?

అలా నవ్వుతూ నవ్వుతూ వున్నప్పుడు అప్పుడు బుర్రలో ఏం తట్టిందో చప్పున "సరేలే! నీ వకీల్ని చూడు. ఈ కారణాలు పనికిరావు. వీటికన్నా బలవత్తరమైన హేతువులు వుంటేనే కాని ఈ నాటకం సాగదు. అంచేత వాటిని ఆలోచించి వకీలుకు చెప్పివెయ్యి... ఇక నేనెందుకు ఇక్కడ వుండటం..." అని కోపోద్రేకంతో ఒక గావుకేకని వేస్తూ అక్కడినుంచి బైటికి వెళ్ళబోయాడు ఎర్విన్. ఈ చేతల్ని మాగ్దా చూడలేకపోయింది. ఒళ్లు మండిపోతున్నది. బల్లమీద వున్న సిరాబుడ్డి తీసి భర్తమీద గబాలున విసిరివేసింది....ఇంకా అక్కడ వుండిపోతే మరేమవుతుందో అతనికి తెలుసు?...

మరకలను తుడుచుకుంటూ, మాగ్దావంక వురిమి చూస్తూ, ఆ ఆఫీసు గదిలోనుంచి గబగబ బయటకు వెళ్లిపోయాడు....

### అనువాదకుని విజ్ఞాపన:

["త్రాగుబోతు" కథలోని మొదటి భాగం ఇలా ముగిసిపోతుంది. ఇక్కడినుంచి త్రాగుబోతు అసలు కథ ప్రారంభమవుతుంది. రచయిత ఈ కథనంతా ప్రథమ పురుషంలోనే చెప్పుకపోతాడు. "త్రాగుబోతు" అని ఈ కథకు పేరున్నా ఇది మనం సాధారణంగా అనుకుండే త్రాగుబోతు తనానికి సంబంధించిన కథ కాదు. మానవుడ్ని అస్తమానమూ ఎదుర్కుంటూ ఉక్కిరిబిక్కిరి చేస్తూవుండే సమస్యలు తండోపతండాలుగా ఇందులో వస్తూ వుంటాయి. వాటిలో మత సమస్యలు వున్నాయి. సాంఘిక సమస్యలు వున్నాయి. ఆర్థిక సమస్యలు వున్నాయి. రాజకీయ సమస్యలు వున్నాయి. అంతెందుకు? ఒక వ్యక్తి తన చుట్టుప్రక్కలవాళ్లతో కలుపుగోలుతనంతో వుండటానికి అవసరమైన వాతావరణం ఇందులో వున్నది. అంతే కాదు? ఒక సమస్యతో మరో సమస్య లంకె వేసుకుని వుంటుంది. జీవిత పరిణామమంతా వీటిని తేల్చుకుంటూ ఒక దరీదాపుని చేరుకోటంతోనే వుంటుంది.

మనం కొంచెం దూరదృష్టితో చూస్తే రచయిత జీవితం, ఆయన తన జీవితంలో తేల్చుకోలేక తికమక పడిపోయిన సమస్యలు ఈ "త్రాగుబోతు" కథలో ప్రతిబింబిస్తూ వుంటాయనే అనవచ్చు.

ఇలాంటి సాహిత్యరత్నాన్ని మనవారికి పరిచయం చేయటానికి అవకాశభాగ్యన్ని ప్రప్రథమంలో ప్రసాదించిన "తెలుగు స్వతంత్ర" సంపాదకులకు ధన్యవాదాలు. ఆ పత్రికలో "త్రాగుబోతు" మొదటి భాగాన్ని ప్రచురించాను. పత్రిక నిలిచిపోవటం మూలాన తరువాత భాగం అజ్ఞాతవాసంలో వుండిపోవలసివచ్చింది. "గృహలక్ష్మి" సంపాదకుల ప్రోత్సాహం మూలాన ఇప్పుడు ఈ భాగాలను మనవారికి అందచేయటానికి అవకాశం కలిగింది. ఇంతకు ముందు ప్రచురించిన జర్మను కథానికలకు మల్లె ఈ కథపట్లకూడా "గృహలక్ష్మి" పాఠకులు తగిన ఆదరం చూపుతారనే ఆశిస్తూవున్నాను.

—అనువాదకుడు]




విజయలక్ష్మి ఫిలిమ్స్‌వారు 'పార్వతీవిజయము' అనేచిత్రాన్ని విడుదల చేయబోతున్నారు. ఇందులో శంకరుడుగా త్రిలోక్ కపూర్, మాయాసుందరిగా బిమల్ కుమారి, శాంకరిగా సులోచన నటిస్తున్నారు. ఈ పౌరాణిక చిత్రానికి సంగీతం శ్రీ ఎ గోపాలం, మాటలు, పాటలు శ్రీ మద్దిపట్ల సూరి నిర్వహిస్తున్నారు. నిర్మాత శ్రీ వి. నరసయ్య చౌదరి. పబ్లిసిటీ నిర్వహణ శ్రీ పి. తిరుపతిరావు. సెప్టెంబరు నెలలో విడుదలగుతుందని వార్త.

♦ ♦ ♦

మహేంద్రా పిక్చర్స్‌వారి 'కృష్ణప్రేమ' చిత్రనిర్మాణం త్వరత్వరగా సాగుతున్నది. శ్రీ అదుర్తి సుబ్బారావు దర్శకత్వమున యీ చిత్రమును మనోజ్ఞంగా తయారుచేస్తున్నదని వార్తలు. పెండ్యాల వారు సంగీత దర్శకత్వమును నిర్వహిస్తున్నారు. ఇందులో బాలయ్య, రేలంగి, జమున, గిరిజ మున్నగువారు నటిస్తున్నారు. శ్రీకృష్ణుని చరిత్రానికి సంబంధించిన రాసక్రీడలు మున్నగునవి ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించవచ్చు.

♦ ♦ ♦

డి. బి. యస్. ప్రొడక్షన్స్‌వారి 'పెండ్లిపిలుపు' చిత్రనిర్మాణం సాగుతున్నది. శ్రీ ఎ. శేషగిరిరావు దర్శకులు. యన్. టి. రామారావు, రేలంగి, సి. యస్. ఆర్., దేవిక, కన్నాంబ మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

శ్రీ చేతనావారు నిర్మిస్తున్న 'గుళ్లోపెళ్లి' చిత్రం కూడ త్వరలో విడుదల కావడానికి ఆయత్తమగుచున్నది. బాలయ్య, రమణారెడ్డి, కృష్ణకుమారి మున్నగువారు నటిస్తున్నారు. శ్రీ కె. ప్రకాశరావు గారి దర్శకత్వము.

♦ ♦ ♦

పొన్నలూరి బ్రదర్స్‌వారి సాంఘిక చిత్రం 'కాడెద్దులు ఎకరా నేల' తయారగుతున్నది. ఇందులో జానకి, యన్. టి. రామారావు, జగ్గారావు, రమణారెడ్డి మున్నగువారు నటిస్తున్నారు. శ్రీ [illegible] దర్శకత్వాన మేలైన చిత్రంగా రూపొందుతున్నదను కుంటున్నారు.

♦ ♦ ♦

హైదరాబాద్ మూవీస్ వారు "జల్సారాయుణ్ణి" త్వరలో విడుదలచేయ సంకల్పించుకొని కృషి చేస్తున్నారట. శ్రీ చాణక్య దర్శకత్వం నిర్వహిస్తున్నారు. జమున, కన్నాంబ, జగ్గయ్య నటిస్తున్నారు.

♦ ♦ ♦

శ్రీ రామినీడు దర్శకత్వాన మంజీరా ఫిలిమ్స్‌వారి సాంఘిక చిత్రనిర్మాణం అభ్యుదయమార్గంలో నడుస్తున్నది. సావిత్రి, బాలయ్య, కాంతారావు, రమణారెడ్డి, శోభ, డా॥ ప్రభాకర్ రెడ్డి మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

విశ్వరూప ఫిలిమ్స్‌వారు శ్రీ వి. మధుసూదనరావు దర్శకత్వాన చిత్రనిర్మాణం తలపెట్టారు. ఇందులో జమున, జగ్గయ్య, దేవిక, కాంతారావు, సూర్యకాంతం, రమణారెడ్డి మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ వేణు సంగీత దర్శకులు.

♦ ♦ ♦

'భక్తజయదేవ' చిత్రాన్ని లలితకళా నికేతన్ వారు శ్రీ యస్. రాజేశ్వరరావు సంగీతంతోటి, సముద్రాలవారి రచనతోటి నిర్మిస్తున్నారు. ఇందులో జయదేవుడుగా ఎ. నాగేశ్వరరావు, పద్మావతిగా అంజలీదేవి నటిస్తున్నారు.

♦ ♦ ♦

పృథ్వీరాజ్, దిలీప్‌కుమార్, మధుబాల మున్నగువారు నటిస్తున్న 'మొగల్-ఇ-అజామ్' చిత్రం విడుదలైంది. ఇది కోటిరూపాయల ఖర్చుతో, పది సంవత్సరాల కాలం బహుజాగ్రత్తతోటి, ఆసక్తితోటి తయారుచేసిన చిత్రం. విశేషంగా ప్రజల నాకర్షించగల చిత్రమని వార్తలు.

♦ ♦ ♦

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారి 'నాగార్జున' గృహప్రవేశ సందర్భమున అతిథి సత్కారం, విందు, పాటకచ్చేరి [illegible] జరిగింది. శ్రీ నాగేశ్వర

రావుగారి కళాపిపాసకు, ఆరాధనకు నూతన భవనం, యీ యుత్సవం నిదర్శనమని చెప్పాలి.

చిత్ర సమీక్ష

## భక్త శబరి

సుఖీభవ ప్రొడక్షన్స్‌వారి 'భక్తశబరి' చిత్రము విడుదలయింది. ఇందులో పండరీబాయి, కీ॥ శే॥ ఆర్. నాగేశ్వరరావు, నాగయ్య, హరనాథ్, రాజశ్రీ, రామకృష్ణ, మీనాకుమారి మున్నగువారు నటించారు. దర్శకులు చిత్రపు నారాయణమూర్తి.

'శబరి'ని గురించి రామాయణంలోని శ్రీరామచంద్రాదులకు వనవాస సందర్భమున వృద్ధురాలుగా ఆతిథ్యమిచ్చి తరించిన ఘట్టం చాలమందికి తెలియును. ఇందులో కొన్ని జానపద కథల అల్లికతో శబరి పడుచుదనపు జీవితాన్ని చిత్రించాలని ప్రయత్నం జరిగింది. పురాణాధార సంయుతమయిన కథ కాకపోయినా కథ పొందిక, గమనము సహజంగాను, భక్తశబరి వ్యక్తిత్వాన్ని ఆదినుండి అంతమువరకు పోషిస్తూనే యుండింది. రచయిత, దర్శకుడు కూడ యీ సందర్భమున ప్రత్యేకశ్రద్ధ వహించారని చెప్పాలి.

పండరీబాయి శబరి పాత్రను ప్రశంసనీయంగా నిర్వహించింది. ఇతర నటీనటులు సయితము బాగానే నటించారు. పరిమితమయిన హాస్యం, ఉత్తమస్థాయిన నడిచిన మాటలు, పాటలు చిత్రాన్ని మరింత రక్తి కట్టించాయి. ముఖ్యంగా కొన్ని పాటలు భావయుక్తంగాను, హృదయరంజకంగాను నున్నవి. సంగీతము బాగున్నది.

అనేకవిధాల ఉత్తమస్థాయిలో నిర్మాణమయిన 'భక్తశబరి' చిత్రము యీ మధ్యన వెలువడిన పౌరాణిక చిత్రాలలో మేలైనదని చెప్పవచ్చును. ప్రజల నాకర్షించి విజయయాత్ర సాగించుచున్నదని విశేషంగా వార్తలు వస్తున్నవి.

—పున్నయ్య

♦ ♦ ♦

## విష్ణుమాయ

నందూరి నమ్మాళ్వార్ ఆచార్య దర్శకత్వాన వెంకట్రామా ఫిలిమ్సువారు నిర్మిస్తున్న పై పౌరాణిక చిత్రం హుటాహుటీగా సాగుతున్నది. రాజనాల, కాంతారావు, కృష్ణకుమారి, కమలకుమారి, సంధ్య, మిక్కిలినేని, సత్యనారాయణ, శివరావు, పులిపాటి ప్రభృతులు నటిస్తున్న యీ చిత్రకథను గబ్బిట వెంకట్రావు వ్రాశారు. మల్లేశ్వరరావు సంగీతం నిర్వహిస్తున్నారు. చంద్రశేఖర్ నిర్మాణం చూస్తున్నారు.

(మధురవాణి బులిటిన్)

♦ ♦ ♦

S. V. M. పిక్చర్సువారు తమ మొదటి సాంఘిక చిత్రానికి జూలై 28 తారీఖున గోల్డెన్ స్టూడియోలో ప్రారంభోత్సవం జరిపారు. సుశీల, పి. బి. శ్రీనివాస్, రామచంద్రరావుగార్లు పాడిన పాటలకు మ్యూజిక్ డైరక్టరు శ్రీ నిత్యానందంగారు చక్కని సంగీతాన్ని సమకూర్చారు.

ఈ చిత్రానికి నవయువకుడైన శ్రీ నందనరావు డైరక్షన్, అసోసియేటెడ్ డైరక్టరు యస్. వి. దొరై. మేకప్ - శ్రీ వీర్రాజు, మోహనవయ్యగార్లు. నిర్వహించే ఈ చిత్రానికి నిర్మాతలు యం. నారాయణరెడ్డి, కె. యస్. కృష్ణయ్యగార్లు. పబ్లిసిటీ పి. తిరుపతిరావు.



పశ్చిమ బెంగాలులోని నిర్వాసమహిళల వృత్తి శిక్షణా కేంద్రంలో యిద్దరు స్త్రీలు
చాపలపై అందమైన నమూనాలను చేయనేర్చుకొనుచున్నారు.




S. P. S. శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి మహారాజ్ ఆత్మకథ మాకార్యాలయమునకు చేరినది. శ్రీ స్వామిగారు శ్రీస్వామి శివానంద సరస్వతి మహారాజ్ (ఋషికేశం) ప్రియశిష్యులు శ్రీ శివానందభగవానుల సందేశవ్యాప్తికి నిరంతరము కృషిచేయుచున్నవారు. ఇందులో స్వామిజీ జననం మొదలు యీ నాటివరకు వారిజీవితవివరాలు, చేసిన యాత్రలవివరాలుగలవు.

♦ ♦ ♦

**మహాసౌరమంత్ర పాఠము ఆంధ్ర పద్యానువక్త శ్రీ శ్రీయానందనాధుడు ఈశ్వర సత్యనారాయణ శర్మ, ప్రకాశకులు - సాధనగ్రంథమండలి, తెనాలి. వెల 75 నయాపైసాలు.**

మూలమంత్రముతో బాటు, ఆంధ్ర పద్య, ఆంగ్లగద్య అనువాదసహిత మీ గ్రంథము. సూర్యోపాసన ప్రత్యక్ష ఫలప్రదము. ఇందుకు తోడ్పడునది మహాసౌరమంత్రము. అయితే మూలమంత్రమును సుస్వరముగా నందరు నుచ్చరించుట సులభము కాదు. ఈ మంత్ర ప్రతిపాదితార్థమును సులభముగా నొనర్చుచు సరళంగా తెలుగులో పద్యములరూపంగాను, దానివెంబడే శ్రీ యం. సి. రామారావుగారి ఆంగ్లగద్యానువాదము కలవు. సూర్య ఉపాసకులు ఏఏ కోర్కెలకు ఏఏ మంత్రముల పఠించవలెనో సూచింపబడియున్నది.

**శ్రీవరసిద్ధి వినాయకస్తవము : శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావు, తియోసాఫికల్ లాడ్జి, బళ్లారి**

మనయిండ్లలో ప్రతియొక్క కార్యమును విఘ్నేశ్వరుని తలచుకొననిదే చేయుటలేదు. వరసిద్ధివినాయకుడు మనం ప్రతిపనిని నిర్విఘ్నంగా సాగేలాగ అనుగ్రహించి మనకోర్కెలను తీర్చునని ప్రతీతి. శ్రీ విఘ్నేశ్వరుని కరుణాకటాక్షములు సుగమమగుటకనువుగా గ్రంథకర్త కీర్తించి, స్తోత్రముచేయుటకని ఉద్దేశించి యీగ్రంథమును రచించారు. సరళమైన శైలిలో, భావరసపూరితములైన యిందలి పద్యాలు బాగున్నవి.

**కోపము - దానిని తగ్గించుకొనుట: అనువాదకులు శ్రీ నండూరి వెంకటసుబ్బారావు, దక్షిణపువీధి, ఏలూరు.. వెల 50 నయాపైసాలు,**

ఇది శ్రీ స్వామి శివానంద సరస్వతివారి ఆంగ్లమూలమున కనువాదము. కోపము మానవుని సహజ స్వభావములలో నొకటి. కాని దానిని తను స్వాధీనమునందుంచుకొనవలెను. స్వాధీనము తప్పినచో పరిణామాలు విషమమయినా కావచ్చును. ఇందులో కోపము, దానియొక్కరూపములు, కోపముయొక్క తత్వము మున్నగు విషయ వివరణతో దాని జయించుట, వశము చేసికొనుటకు మార్గములు సూచించబడినవి. ఆధ్యాత్మిక, పారమార్థిక చింతలకు కోపం ఒక ఆటంకము. దానిని జయించుటకు యీపుస్తకంతోడ్పడ వచ్చును.

—✻—

# సంపాదకీయములు

## ఆగష్టు 15

ఆగష్టు నెల జాతీయ చరిత్రకు మైలురాయిలాంటిది. మన జాతీయ సమరాన్ని గురించికాని, మన నాయకులను గురించికాని, స్వాతంత్ర్యసిద్ధిని గురించికాని మాట్లాడేముందు ఆగష్టు 15 ప్రముఖంగా కనుపిస్తుంది. ప్రతిసంవత్సరం జాతీయ పర్వదినంగా స్వాతంత్ర్యదినాన్ని యీ నెల 15 తేదినాడు ఉత్సవాలతోటి, ఊరేగింపులతోటి, బహిరంగ సభావేశములతోటి జరుపుకుంటున్నాము.

మనకు స్వాతంత్ర్యము సిద్ధించడానికి మన జాతీయ నాయకత్వము నిర్వహించిన పాత్ర మరువరానిది. వీరోచితంగా పోరాడి జాతీయ శ్రేయస్సును, సౌభాగ్యమును ఆశయ లక్ష్యాలుగా దీక్షాకంకణబద్ధులై స్వాతంత్ర్య సమరంలో అజేయమైన నాయకత్వము వహించినవారిని, వీరోచితంగా పోరాడి అఖండ త్యాగాలు చేసిన వీరులను మనం సంస్మరించడమేకాక ఆరాధించడం కృతజ్ఞతా చిహ్నము. దాంతోబాటు వారి చిత్తశుద్ధిని, ధైర్యసాహసాలను, సేవాత్యాగాలను ఆదర్శంగా నుంచుకొని జాతీయ పురోభివృద్ధిని రూపొందించడం దేశభక్తుని లక్షణం.

జాతీయ, అంతర్జాతీయ రంగాలలో మనం గడిస్తున్న కీర్తి ప్రతిష్టలు ముమ్మాటికి పేర్కొనతగినవి. మన జాతీయ నాయకత్వము అభివృద్ధి అభ్యుదయాల నుద్దేశించి చేయుచున్న కృషి ప్రశంసాపాత్రము. మనం సాధించిన విజయాలకు, మనకు సిద్ధించిన స్వాతంత్ర్యానికి కారకులైన నాయకులను, వీరులను, త్యాగులను యీ సందర్భమున స్మరించి, పుష్పాంజలి ఘటించవలసియున్నది. వారి నాయకత్వము, బోధనలు, స్వార్థరహితమైన సేవాత్యాగాలు మనకు మార్గదర్శకములై మన జాతీయ సౌభాగ్యమును పెంపొందించుగాక!

## తండ్రి ఆస్థిలో ఆడపిల్లలకు వాటా

కొన్ని రాష్ట్రాలలో వివాహితులగు ఆడపిల్లలకు తండ్రి ఆస్థిలో మగపిల్లలతో సమానంగా వాటా లేకుండా చేయాలని ప్రయత్నము జరుగుచున్నట్లు వింటున్నాము. ఇట్టి ఆలోచనలు సమంజసము కానేరదు. ఆడపిల్లలకు, మగపిల్లలకు విద్యావికాసములు కలిగించి, వివాహములు చేయువరకు తల్లిదండ్రులు సమాన బాధ్యత కలిగియున్నారు. వివాహానంతరమయినా ఆస్థిపాస్తుల పంపకంలో హెచ్చుతగ్గులెందుకుండవలెనో అర్థము కాదు. తల్లిదండ్రులు సమానంగా ఆడపిల్లల, మగపిల్లకాయల అభివృద్ధి, సౌభాగ్యాలను ప్రోత్సహించి ఆనందించవలసినవారే. ఇందులో ఎవరికి లోటు కలిగినా తల్లిదండ్రులకు బాధాకరమే. వృద్ధాప్యంలో తల్లిదండ్రుల పోషణ వగైరాలు సయితము ఆడపిల్లలు చేయలేనిదానిని మగపిల్లకాయలు చేయుదురనిగాని, చేయగలరనికాని చెప్పజాలము. ఆడపిల్లలు, మగపిల్లలు సమానంగా ప్రేమాభిమానాలతోటి తల్లిదండ్రులను పోషించడానికి సయితము ఆస్థిపాస్తుల వాటాలు మగపిల్లకాయలతో సమానంగానే యుండాలి. ఇందువలన తల్లిదండ్రులకు, బిడ్డలకు మధ్య సన్నిహిత ప్రేమానురాగాలు ఏర్పడి వృద్ధాప్యంలో చీకు, చింత లేక తల్లిదండ్రులు జీవయాత్ర గడుపగలరు.

## మానసిక, శారీరక దార్ఢ్యము

రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ప్రస్తుత జీవితములో ప్రతియొక్కరికి శారీరక, మానసిక దార్ఢ్యము అవసరమనియు, అదియే అభివృద్ధి, అభ్యుదయ చిహ్నమనియు వివరించారు. ఇందలి యథార్థము జాతీయ శ్రేయస్సు దృష్ట్యా ప్రతియొక్కరు గుర్తించాలి.

విద్యావిజ్ఞానములు మానవుని జీవితమును తీర్చిదిద్దునవి. కాని అవి మానసికంగా అవి చిత్తశుద్ధిని, ఆత్మవిశ్వాసాన్ని, మంచిచెడ్డల విచక్షణాజ్ఞానాన్ని, ధైర్యసాహసాలను సమకూర్చునవిగా నుండాలి. అదే మానసిక దార్ఢ్యమునకు చిహ్నము. అయితే మానసిక దార్ఢ్యముండియు శారీరకంగా ఆరోగ్య బలసంపదలు లేనిచో మానవ జీవయాత్ర సుఖప్రదం కాలేదు. ప్రతిక్షణం తన జీవయాత్రకు తన శక్తిసామర్థ్యాలు తోడునీడై యుంటునవి. అవియున్ననే మానవుడు ఏది చేసినా, ఎంతటి ఘనుడనిపించుకున్నను. మానసికంగాను, శారీరకంగాను సమానంగా దృఢముగా నున్నవారే ఆయురారోగ్య సౌభాగ్యాలతోటి సమర్థులనిపించుకుంటారు. కాబట్టి స్త్రీలు, పురుషులు, బాలలు కూడ శారీరక, మానసిక దార్ఢ్యమున కవసరమయిన అలవాట్లకు, శిక్షణకు పూనుకోవలసియున్నది.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

LODHRA PRESS, MADRAS-14.